# కథామాలతి 7వ సంపుటం

మే 2017-ఆగస్ట్ 2023 మధ్యకాలం రచనలు



నిడదవోలు మాలతి

2023

కథాక్రమం

# పరిచయం

2017లో **కథామాలతి 6వ సంపుటం** సంకలనం పూర్తి చేసేక, ఇంక రాయలేను అనుకున్నాను. అప్పటివరకూ రాసిన ఇతర రచనలు **ఇంతే సంగతులు** అని మరో సంకలనం సమకూర్చేను, మంగళం మహత్ అనుకుంటూ.

అయితే నేననుకున్నట్టు రాయడం మానలేదు. ఎప్పటికేది తోస్తే అదే రాస్తూ మరో ఆరేళ్లు గడిపేను. తిరిగి చూసుకుంటే మళ్లీ మరో సంకలనం చేయడానికి సరిపోయిననన్ని కథలే, కాక మరో రెండు సంకలనాలకి చాలినన్ని వ్యాసాలు, ఇతర రచనలూ కూడా కనిపించేయి.

ఈసంకలనంలో 27 రచనలు, 2017 ఏప్రిల్ తరవాత రాసినవీ, మరో నాలుగు నాచిన్ననాడు రాసినవీ ఉన్నాయి. అన్నీ కథలు కాదు. కొన్ని గల్పికలు లేదా స్కెచ్ అనాలి అంటే ఒకటో రెండో సంఘటనలు మాత్రమే ఆవిష్కృతమైనవి.

ఇంతకుముందు సంకలనాల్లా కాక, కాలక్రమానికి అనుగుణమైన వరుసలో అమర్చేను. కొన్ని కథలమీద చర్చలు కూడా కథలచివరలో కూర్చేను.

ఈసంకలనంలో మొత్తం 29 రచనలు ఉన్నాయి. 2017 మే నుంచి ఇప్పటివరకూ రాసినవి కాక, మరో నాలుగు నాచిన్ననాటి రచనలు ఉన్నాయి. కొన్ని కథలు. కొన్ని గల్పికలు. అయితే కథకీ గల్పిక లేక స్కెచ్ కీ తేడా ఏమిటి అంటే ఖచ్చితంగా చెప్పగల నిర్వచనాలు ఇంకా ఏర్పడినట్టు లేదు. ఆ చర్చ అంతా ఇక్కడ పెట్టను కానీ ఈ సంకలనంలో వాటిని వేరు చేయడానికి ప్రయత్నించేను, శీర్షికపక్కనే ఏది ఏదో తెలియజేస్తూ.

ముఖ్యంగా కథల్లో తప్పక రచయిత చెప్పదలుచుకున్న అంశం బలంగా ఉంటుంది. ఆ అంశం ప్రతిపాదించడం (ఎత్తుగడ), కొన్ని సంఘటనలతో విస్తరించడం, చివర్లో ఒక కొలిక్కి (ముగింపు) తేవడం ఉంటుంది. కల్పిత పాత్రలూ, సంఘటనలకి ఎక్కువ ఆస్కారం ఉంటుంది. అందుకు భిన్నంగా గల్పికలో ఒకటో రెండో సంఘటనలు గబగబా చెప్పేయడం జరుగుతుంది. వీటిలో పెద్ద సంఘర్షణలు ఉండవు.

అలా చూసుకుంటే, ఈ సంకలనంలో 15 కథలున్నాయి. వీటిలో నేను ఆవిష్కరించిన అంశాలు తీసుకుంటే, ముసలితనం, వేరువేరు తరాలమధ్య ఆలోచనలలో, నిర్ణయాలు తీసుకోడంలో వైవిధ్యం, సమాజంలో వివిధరంగాలలో నేను గమనించిన అంశాలూ అని స్థూలంగా చెప్పుకోవచ్చు. ముసలితనానికి సంబంధించిన కథల్లో **పెద్దతనం** 2009లో మొదట ప్రచురించేను. కథామాలతి రెండవసంపుటంలో ఉంది. ఈకథతో పాటు **ఆద్యంతాలు, భ్రాంతి, ఎంతెంత దూరం**

చదివితే, వృద్ధాప్యంగురించి నాఅభిప్రాయాలు మరింత స్పష్టంగా తెలుస్తాయన్న అభిప్రాయంతో ఇక్కడ మళ్లీ చేర్చేను. నేను ముసలిదాన్నే కనక, చుట్టుపట్ల ఉన్న జనాలు అస్తమానం పదే పదే, “మీరు పెద్దవారు” అనడం వింటున్నాను కనక ఇవన్నీ ఒకచోట పెట్టి చదివితే ఎలా ఉంటుందో పాఠకులు గ్రహించే అవకాశం ఉంటుందని మళ్ళీ ఇక్కడ ఆకథ కూడా చేర్చేను.

**కుక్క పారిపోయింది** అనేకవిధాల విలక్షణమైన కథ. ఏదేశంలోనైనా మనిషికీ జంతువులకీ అవినాభావసంబంధం ఉంది. ఆ అనుబంధంగురించి అనేకకథలు వ్యాప్తిలో ఉన్నాయి. అయితే, మనిషి ఘోరంగా ప్రవర్తించడం చూస్తూనే ఉన్నాం. ఎల్లవేళలా కారణాలు చెప్పలేం కూడా. అలాగే జంతువులు కూడా. ఇది నిజంగా జరిగిన ఉదంతం ఆధారంగా రాసినకథ. కథకింద ఇంకా ఎక్కువ వివరాలు ఇచ్చేను.

నేను నారచనావ్యాసంగం మొదలు పెట్టినరోజులలోవి, అంటే 50వ దశకంలోవి, గత 4, 5 ఏళ్లలో దొరికిన 3 గల్పికలు, ఒక కథ కూడా చివరలో చేర్చేను. **రాద్ధాంతంపై సిద్ధాంతం** ఇంతకుముందు మరో సంకలనంలో ఉంది కానీ అప్పట్లో **రాద్ధాంతం** దొరకలేదు. ఇప్పుడు దొరికింది కనక సందర్భం తెలుస్తుందని దానివెంట రాసిన ఈ రెండోకథ కూడా చేర్చేను. ఇంతవరకూ నాకు దొరికినరచనల్లో ఈ **రాద్ధాంతం** మొట్టమొదటిది.

గల్పికలుగా నేను గుర్తించినవి ఆనాటి **రాద్ధాంతం** నించి ఫిబ్రవరి 2023లో రాసిన **వాక్స్వాతంత్ర్యం వెల** వరకూ కూడా ఏదో ఒక సంఘటన చూసినప్పుడో విన్నప్పుడో అట్టే ఆలోచన లేకుండా రాసేసినవే. బహుశా ఆలోచించి కథగా రాసే ఓపిక లేక గల్పికలుగా రాసేనేమో. గల్పిక అంటే హాస్యమో వ్యంగ్యమో ఉండాలని ఎక్కడో చదివేను కానీ అన్నివేళలా కాదేమో. ఉదాహరణకి ఈ సంకలనంలో **భుక్తి కుదిరితే గాని నిష్ఠ కుదరదు** చెప్పుకోవచ్చు. ఊరికే, ఆ సామెతమీద రాయాలనిపించి రాసేను. ఆతరవాత ఆచార్య రాణీ సదాశివమూర్తిగారు చక్కని వివరణ ఇచ్చేరు. హాస్యమూ లేదు, వ్యంగ్యమూ లేదు. ఒక చిన్న సంఘటన, అంతే.

ఒక్కమాటలో చెప్పాలంటే, ఈ ఒక్క సంకలనం నాసాహిత్యప్రస్థానాన్ని స్థాలీపులాకన్యాయంగా వివరించినట్టుంది అంటాను.

ఇలాగే వ్యాసమాలతి మరో సంకలనం, మిగతా ఊసుపోకలాటి చిన్న చిన్న కతలు మరో సంకలనం చేసేప్రయత్నంలో ఉన్నాను.

ఎప్పట్లాగే ఈ సంకలనాన్ని కూడా ఆదరించగలరని ఆశిస్తూ …

నిడదవోలు మాలతి

8.19.2023

ఇంతకుముందు సంకలనాల్లా కాక, కాలక్రమానికి అనుగుణమైన వరుసలో అమర్చేను. కొన్ని కథలలో ఇతివృత్తాలు అసాధారణమైనవి. అలాటికథలదగ్గర వివరణ ఇచ్చేను. ఒకొకప్పుడు అలా జరిగిఉండదు అనిపించేఅంశాలు రచయితలు అందుకే రాస్తారు. అంటే తరుచూ జరక్కపోవచ్చు కానీ జరుగుతాయి. అందుకే అవి కథలవుతాయి. నమ్మలేం అనిపించే సంఘటనలు కూడా జరుగుతాయి. అలాగే, మరొక కోణం, ముగింపు ప్రగతిశీలకంగా ఉందా లేదా అన్నది కూడాను.

తొలిదశలో రాసిన 3 గల్పికలు, ఒక కథ, ఈనాలుగేళ్లలో దొరికినవి, చివరలో చేర్చేను. **రాద్ధాంతంపై సిద్ధాంతం** ఇంతకుముందు మరో సంకలనంలో ఉంది కానీ అప్పట్లో **రాద్ధాంతం** దొరకలేదు. ఇప్పుడు దొరికింది కనక సందర్భం తెలుస్తుందని దానివెనువెంట రాసిన ఈ రెండోకథ కూడా చేర్చేను.

ఇలాగే వ్యాసమాలతి మరో సంకలనం, మిగతా ఊసుపోకలాటి చిన్న చిన్న కతలు మరో సంకలనం చేసేప్రయత్నంలో ఉన్నాను.

ఎప్పట్లాగే ఈ సంకలనం కూడా మీఆదరణకు పాత్రమవగలదని ఆశిస్తూ,

నిడదవోలు మాలతి

8.18.2023

# 1. భీమారావు కత – హత్యా? ఆత్మహత్యా? (కథ)

చిన్న గుమాస్తా భీమారావు ఉద్యోగంలో చేరగానే ఓ ఇరుకువాటా వెతుక్కున్నాడు. వెంటనే మిత్రులు వాటాకి భీమా తీసుకోమని సలహా ఇచ్చేరు. ఆవెంట వరసగా తెలిసేయి తీసుకోవలసిన భీమాలు

అద్దెవాటాకి భీమా, అందులో గల కుంటిబల్లకీ, పాతకుర్చీకీ, నాలుగు బొచ్చెలకీ భీమా.

ఒళ్ళు భీమా, కళ్ళూ, పళ్ళూ భీమా, కళ్ళజోడు భీమా

Medicare ఇచ్చే హామీ చాలదని, మరో భీమా medigap

వీటన్నిటికీ మందులకోసం మరో భీమా

బతుకుభీమా. అందుకు ఇంట్లో ఇటు రెండుతరాలు అటు రెండుతరాల ఆరోగ్యచరిత్రలు

ఉద్యోగం ఊడినవేళ ఆదుకోడానికి మరో భీమా

కారు భీమా, బైకు భీమా,

చచ్చేక అపరకర్మకి భీమా.

భీమాలకి కిస్తీలు కట్టుకోడానికి నోరు కట్టుకున్నాడు.

నిత్యం సంధ్యావందనం చేసినంత శ్రద్ధగా కిస్తీలు చెల్లించుకుంటూ పోయేడు.

భీమారావు భీమాకంపెనీలని పోషించడానికి ఉద్యోగం చేస్తున్నాడు.

ఈ కిస్తీలు చెల్లించేక చేతిలో చిల్లిగవ్వ మిగలక, తిండి లేక మాడిపోయేడు.

దేవుడా ఇంత చేసేవా అనుకుంటూ అసువులు బాసేడు.

భీమరావు భార్యామణి కళ్ళు తుడుచుకుని,

దేవుడు ఏం చేసేడో, ముందేమి చేస్తాడో, చేయగలడో విచారించుకుంది.

భీమాకంపెనీకి విన్నవించుకుంది తమకు రావలసిన సొమ్ము పంపమని.

భీమాకంపెనీ ఎంతో మర్యాదగా భీమారావు అకాలమరణానికి విచారం వెలిబుచ్చేరు.

వివరాలు కనుక్కున్నారు. భీమారావు భార్యామణి అప్పీలు తప్పక పరిశీలించి, సొమ్ము అందజేస్తామని హామీమీద హామీలు కురిపించేరు.

ఆర్నెల్లతరవాత కాయితమ్ముకొకటి పంపేరు భీమారావు భార్యామణికి. బాంకులో కాషు చేసుకోగల కాయితం కాదది.

తమకి రావలసిన సొమ్ము ఏమీ లేదు. పంపలేనందుకు విచారిస్తున్నామంటూ సమచారం తెలిపే కాయితం మాత్రమే అది.

భీమారావు స్వచ్ఛందంగా తినవలసిన తిండి మానేసేడు.

తినగలిగినవాడు తినకుండా ఊరుకోడంలో స్వకీయమైన నిర్ణయం ఒకటుంది.

భీమారావు తినవలసిన, తినగలిగిన తిండి తెలిసి తెలిసి మానీసేడు.

భీమారావు తనచావు తానే కోరి తెచ్చుకున్నాడు.

అది ఆత్మహత్య. భీమారావు తీసుకున్న భీమాపథకం ఆత్మహత్యని అంగీకరించదు.

భీమారావుభార్యామణి బీమా సొమ్ముకు అర్హురాలు కాదు.

భామామణి నెత్తీ నోరూ కొట్టుకుని ఏడ్చింది.

తెచ్చుకున్న నాలుగురాళ్ళూ వాళ్ళఎదాన కొట్టినందుకు పెక్కి పెక్కి ఏడ్చింది.

కడుప్మండింది. కోటి శాపనార్థాలు పెట్టింది.

మళ్లీ మళ్ళీ వాళ్ళ ఆఫీసుచుట్టూ తిరిగింది. కాళ్ళా వేళ్ళా పడి బతిమాలింది.

భీమావర్తకులు సరే చూస్తామంటూ కాయితాలు లాగేరు. కిందా మీదా తిరగేసేరు.

చిల్లులకోసం పెతికేరు. ఎంత పెతికినా ఒక్కటే కనిపిస్తోంది.

తినకపోవడం నేరం. తనకు తానై ఉపోషాలుండి చావు తెచ్చుకుంటే అది ఆత్మహత్య.

అందువలన భీమా సొమ్ము ఇవ్వబడదు, ఇవ్వగల వీలు ఏమాత్రమున్నూ లేదు.

000

భామామణి బాధ చూసి, మనసు కరగిన లాయరొకరు ఆమెతరఫున కేసు పెట్టేడు.

భామామణితరఫున గట్టిగా బల్లగుద్ది వాదించేడు, “కాదిది ఆత్మహత్య. అవునిది హత్య. మీరంతా కలిసి, భీమాలమీద భీమాలు కట్టించి ప్రాణం తీసేరు. మీరు హంతకులు. అతడు హతుడు”.

కోర్టులో కేసు నడుస్తోంది.

గెలుపెవరిదో ఇంకా తేలలేదు.

ఆత్మహత్య అని కోర్టువారు నిర్ణయిస్తే భీమాకంపెనీకి లాభం.

హత్య అని అయితే భీమారావుభామామణిలాయరుకి లాభం.

భీమారావుకాయం గండుచీమలకాహారం.

(మే 10, 2017)

## 2. భ్రాంతి (కథ)

(గమనిక: ఈమధ్య నేను చదువుతున్న కొన్ని పుస్తకాలవల్ల నాకు కలిగిన కొన్ని సందేహాలకి అక్షరరూపం ఈకథ. నాకే అయోమయం కనక మీకు కూడా అయోమయంగానే తోచవచ్చు.)

000

బ్రహ్మానందం బిక్కుబిక్కుమంటూ ఓమూల నక్కి, రెండు పిడికెళ్ళు గుండెలకి హత్తుకుని ముడుచుక్కూర్చుని ఉండగా –

పోలీసులు ఇల్లంతా వెతికేస్తున్నారు. ఇక్కడ చూడు అక్కడ చూడు అంటూ ఒకొరికొకరు సూచనలు, ఇది చూడు, అది చూడు అంటూ సలహాలు …

ఒణికిపోతూ ఒక మూల నక్కి కూర్చున్నాడు బ్రహ్మానందం. ముచ్చెమటలు పోసేస్తున్నాయి. ఇదెక్కడిగోలరా బాబూ అంటూ సెత్తి బాదుకుంటున్నాడు అతను మౌనంగానే, మనసులోనే.

ఏమయిందేమయిందంటూ వాకిట్లో ఆడా, మగా పిల్లా పెద్దా అని లేక అన్ని రకాల శాల్తీలు గుమి గూడి గోలగోలగా మాటాడేస్తున్నారు.

తుపాకీతో కాల్చేసేట్ట.

ఎవర్ని?

ఏమో.

స్కూల్లో పిల్లాణ్ణిట.

ఎందుకెందుకు?????

ఏమో11111

నిజంగానే?

లేదు లేదు. కాల్చలేదు, బెదిరించాడంతే.

బెదిరంచడం కూడా నేరమే, తెలుసా?

అసలెందుకు బెదిరించేడూ?

ఏమో ఏమో …

రామ రామ. కలికాలం.

అంతే మరి. పిల్లలేదో మాటా మాటా అనుకుంటారు, ఆమాత్రానికే కాల్చిపారేయడఁవా?

000

“కలా, బాబూ?”

ఔను. తల కాశీబోడాంలా ఆడించేడు కిందకీ మీదకీ.

“పోనీలే. కలే కదా.”

“కాదు కాదు, చాలా నిజంలాగే ఉంది. నన్ను జైల్లో పడేశారు. ఆ జైలుకూడు రామరామ. మట్టిబెడ్డ నయం.”

“పోనీ, కలలో నేరానికి కలలోనే శిక్ష అయిపోయిందనుకో. ఇప్పుడు జైల్లో లేవు. వంటింట్లో ప్రవీణ కమ్మని భోజనం తయారు చేస్తోంది.”

“ప్రవీణెవరూ?”

“పూర్వజన్మలో నీభార్యలే.”

“పూర్వజన్మలో భార్య ఇప్పుడెలా ఇక్కడికి వచ్చింది?”

“ఇప్పుడు ప్రవీణ కాదులే. రామావతారం, నీ వంటవాడు.”

“నాకు వంటవాడు లేడు.”

“ఇప్పుడున్నాడులే.”

“సరే. ఇంతకీ మీరెవరు?”

“నేను కూడా నీ పూర్వజన్మనుండే వచ్చేను. నీ తాతయ్యని.”

“ఓ, తాతయ్యా, అవును సుమా. నాకు బాగా జ్ఞాపకమే. పక్కవాళ్లపొలంలోంచి సీమ చింతకాయలు నీకిష్టమని తెస్తే, చింతబరికె పుచ్చుకు వీపు చీరేసేవు దొంగతనం తప్పు అని చెప్పడానికి.”

“ఏంటో అప్పట్లో అంతే తెలిసింది. పాపం, ఒళ్లు వాచిపోయింది. కానీ మరొకటి కూడా ఆలోచించు. అందుకేనేమో, ఆ దొంగతనంకారణంగానేమో ఇప్పుడు జైల్లో పడ్డావు. కర్మలు కట్టి కుడపకమానవు కదా.”

“కలలో జైల్లో పడ్డాను. అంతకుముందే నువ్వు చింతబరికెతో బడితెపూజ చేసేవు. మరి అప్పు తీరిపోయినట్టే కదా?”

“ఏమో, తెలీదు. అదొక్కటే కాదు కదా. ఇతర కర్మలు కూడా చేసి ఉంటావు కదా. అవన్నీ లెక్కలోకి వస్తాయి. నువ్వు ఈ జన్మలో సద్వర్తన, సజ్జనసాంగత్యము, శాస్త్ర పురాణాది అధ్యయనములతో ఆ పాపములను ప్రక్షాళన గావించుకుని ఆత్మను పరిశుద్ధము చేసుకొనవచ్చును.”

బ్రహ్మానందానికి అంతా గందరగోళంగా ఉంది. విడదీసేకొద్దీ బిగుసుకుంటున్న ఉచ్చులా ఉంది కానీ ముళ్లు విడివడేదారి కనిపించడంలేదు. మళ్ళీ ఆలోచనలో పడ్డాడు తాతయ్య చెప్పినమాటలు మననం చేసుకుంటున్నట్టు.

నేను ఉన్నాను ఈదేహము నాది, నేను సుఖమో దుఃఖమో అనుభవిస్తున్నానువంటి భావనలు భ్రాంతి మాత్రమే. అది శుద్ధచైతన్యము యొక్క భావన. ఆ భావనే వ్యష్టిగా రూపిస్తున్నాడు. దృక్ దర్శనముద్వారా దర్శించునది దృశ్యము. ఈ దర్శనము దృశ్యము కూడా భ్రమే. ఈదృశ్యము కలవంటిదే. నిజంగా ఏమీ లేవు.

సరే. ఇది అంగీకరిస్తాను. మరి అయితే కలలో నేరం చేసేను. కలలోనే పోలీసులకి పట్టుబడ్డాను. కలలోనే జైల్లో పడ్డాను. మేలుకున్నాను. పోలీసులు లేరు. జైలు లేదు.

జీవితం కలలాటిదే అనుకుందాం. జరుగుతున్నదంతా భ్రాంతి. నిజంగా చంపేవాడు లేడు, చచ్చేవాడూ లేడు. ఈ అసత్త భ్రాంతిరూపంలో చేసిన అకృత్యాలకు ఈ దేహం శిక్ష అనుభవిస్తుంది. కలలో నేరానికి శిక్ష కలలోనే అనుభవించినట్టు, ఈ జీవితంలో చేసిన కర్మలకి ఇక్కడే శిక్ష అనుభవించడంలో అర్థం ఉంది. మళ్లీ నరకం పేరే ఎందుకు? ఇది ఒక సందేహం.

రెండో సందేహం, నరకం, స్వర్గం కూడా చిత్తము, అహంకారమువలన కలిగిన భావములు అని కూడా చెప్పేరు. అలా అయితే నరకములో పడతానేమో అన్న భావానికి ఆస్కారం ఉండకూడదు.

మరో సంశయం – వ్యష్టి ఒక చిత్తముయొక్క చిద్రూపము. బ్రహ్మమనసులో ప్రభవించిన భావానికి ప్రతిబింబము. దీనికి ఇచ్చిన దృష్టాంతము సముద్రము. అదే దృష్టాంతము తీసుకుందాం. నేను దోసిలిలో సముద్రపు నీరు తీసుకుంటాను. నాదోసిలిలో నీరు సముద్రపునీరుకంటె వేరు కాదు. నేను ఆనీరు మళ్ళీ సముద్రములోనికి వదిలేస్తే ఆ సముద్రములోనే కలిసిపోతుంది. అసత్త సత్తలో లయమయిపోతుంది. ఇది సత్త, ఇది అసత్త అన్న పేర్పాటు లేదు. ఇలా వేరు కాని అసత్తయొక్క పునర్జన్మ ఎలా సాధ్యం? నాదోసిలిలోంచి సముద్రములోకి వదిలిన నీరు ఇదీ అని పేరు పెట్టి చూపలేం కదా. అంతే కాదు. ఒకొక జన్మలోనూ ఆ చిత్తమునకు సంబంధించిన లోకవ్యాపారలములవల్లనూ, బంధుమిత్రులవల్లనూ మరిన్ని వాసనలు ఏర్పడతాయి కదా. అంచేత ఏ ఒక్కజన్మలో వాసనలు నిర్మూలించుకుని శుద్ధచైతన్యమునకు చేరువ కావాలన్నా కొత్తవి కూడా చేరుతూ ఉంటాయి కనక సంపూర్ణంగా శుద్ధచైతన్యములో లయమగుట అన్నది భ్రమే అనిపిస్తోంది.

లీలోపాఖ్యానంలో లీల వెనకటిజన్మ, ఆజన్మలో భర్త పిల్లలు— ఇవన్నీ సరస్వతీదేవికరుణవల్ల పునః దర్శించడం జరుగుతుంది. అదే అసత్త పునః జన్మించిందంటే అసత్తకి విడిగా ఒక అస్తిత్వం ఉందనే కదా.

000

అంతకంటె ముందు మరో ప్రశ్న. ఆ శుద్ధచైతన్యస్వరూపుడు మొదట్లోనే అసలు దుష్టభావనలు అన్నవే లేకుండా మనిషిని పుట్టించి ఉండవచ్చు కదా. నేనొకప్రోగ్రాం రాస్తాననుకో. అది నిష్ఫలమౌతుంది అనో దుష్ఫలితాలను ఇస్తుంది అనో అనుకుంటూ రాయను కదా.

"రాయవు. కానీ అలా వికటించడం జరుగుతోంది కదా. ఇదీ అలాటిదే."

అదీ నిజమే. కానీ నేను మానవమాత్రుడను. నాది పరిమితజ్ఞానం. ఆ శుద్ధచైతన్యస్వరూపుడు అపరిమితుడు, జ్ఞానస్వరూపుడు కదా!

000

అసలు స్వర్గసుఖాలు అంటే ఏమిటి? ఈ వేదాంతగ్రంథాల్లో సైతం స్వర్గం వర్ణించినప్పుడు విందులు, వినోదాలు, ఉద్యానవనాలలో విహారాలు వర్ణిస్తున్నారు. అవే స్వర్గసుఖాలు అయితే, భూలోకంలో సుఖాలకీ స్వర్గసుఖాలకీ ఏమిటి వ్యత్యాసం?

అసలు సుఖదుఃఖాలు సమదృష్టితో స్వీకరించాలనుకున్నప్పుడు ఈ స్వర్గసుఖాలను ఆశించడం కానీ అనుభవించడం కానీ కూడా గర్హనీయమే కదా. కష్టాలు సుఖాలు ఒక్కలాగే స్వీకరించాలంటే సుఖం కూడా స్వీకరించవచ్చు కదా.  అసలు ఏది సుఖం, ఏది కష్టం …

కష్టసుఖాలు అనుభవించేది దేహమే కాని చిత్త కాదు అనుకుంటే, కష్టాలనూ, దుఃఖాలనూ ఎందుకు హేయంగా వర్ణించడం?

లవణరాజుకథలో లవణరాజు మానసికంగా యాగం చేసి, యాగంలో  హింస తప్పనిసరిగా ఆచరించవలసివచ్చింది. ఆహింస కారణంగా 60 సంవత్సరాలు హేయమైన జీవితం గడుపుతాడు. ఛండాలస్త్రీని వివాహమాడడం, సంతానం, మాంసభక్షణ వంటివి నీచమైనవిగా చిత్రించడం జరిగింది ఇక్కడ. సుఖదుఃఖాలు సమమే అనుకున్నప్పుడు ఇది ఉత్తమము, ఇది హేయము అన్న వివక్షకి అర్థముందా?

000

సముద్రపొడ్డున కూర్చున్న బ్రహ్మానందం చుట్టూ మరొకసారి పరికించి చూసేడు. పిచికగూళ్లు కట్టుకుంటున్న పిల్లలు, గాలిలో ముళ్లచిగుళ్ల పరుగులు తీస్తున్న రావణాసురుడితలలు, ఊసులాడుకుంటూ చెట్టాపట్టాలేసుకుని పోతున్న యువజంట, వాళ్లని చూస్తూ గతాన్ని నెమరువేసుకుంటున్న ముసలాయన, మరమరాలబండిచుట్టూ చేరిన జనం …

వీళ్ళంతా ఏమైనా ఆలోచిస్తున్నారా? వీళ్ళకి తనకి వచ్చినలాటి ఆలోచనలు ఎప్పుడైనా వస్తాయా? వాళ్ళు ఈ క్షణంలో మాత్రమే బతుకుతున్నారా? నాలాటి చింత లేనివారిగతి ఏమవుతుంది? పక్షులుగానో, మృగాలుగానో, పురుగులుగానో పుట్టినజీవుడు ఎలాటి సత్కార్యాలు చేయగలడు? వాటికి విముక్తి ఎలా ఎప్పుడు కలుగుతుంది?

నీళ్ళలో ఆడుతున్న పిల్లలు హోలోమంటూ అరిచి దూరంగా పరుగెత్తేరు. అటు చూసేడు. ఉవ్వెత్తున లేచిన కెరటం ఒకటి తృటికాలం అలా గాలిలో నిలిచి, ఫెళ్లున విరిగిపడింది.

"నీ విచక్షణ అలా కొనసాగించు. నీకే తెలుస్తుంది జవాబు తగుసమయం ఆసన్నమయినప్పుడు."

ఉలికిపడి చుట్టూ చూసేడు. ఆసందేశం ఎక్కడినుండి వచ్చిందో ఎంత తన్నుకున్నా అర్థం కాలేదు.

000

(ఇందులో ఉదహరించిన కథలు, **లీలోపాఖ్యానం, లవణరాజుకథ** యోగవాసిష్ఠం గ్రంథంలోనివి)

000

(మే 25, 2017)

## 3. మనిషిబుర్రలో అయోమయానికి కారణం (గల్పిక)

"కత రాస్తనం"టూ వచ్చింది సంద్రాలు.

"ఏం కత రాస్తావు?"

"మడిసి ఏల ఇంత బుద్దిలేనోడయిపోనాడా అని."

"సరే రాయి," అన్నాను.

"రాయ్నం నాకు తెల్దని నీకు తెల్దేటి? నాను సెప్తను. నివ్ రాయి," అంది.

కంప్యూటరుమీద రాయడం తేలికే అని చెప్దాం అనుకున్నాను కానీ నామాట సాగదని తెలుసు కనక, "సరే, చెప్పు," అన్నాను లాప్టాపు ధరించినదాననై.

"మడిసికి బగమంతుడు బుర్రిచ్చి తప్పు సేసీనాడు."

"అదేమిటి అలా అంటావు? బుర్ర ఉండబట్టే కద సమస్త ప్రాణికోటిలోనూ ఉత్తముడుగా లెక్క తేలేడు."

"అద్గదే అక్కడే తకరారొచ్చీసినాది. ఇతర పానాలకూ మానవునకూ ఒకేనాగ సేయనేదు."

"సరే. కత మొదలుపెట్టు. కథ పూర్తయేవేళకి నాబుర్రకేమైనా ఎక్కుతుందేమో చూస్తాను."

000

"బగమంతుడు మడిసిని సేసినాడు గద. అవుతే, ఆడు బుద్దిమంతుడే. తొల్త ఆన్ని మంచోడుగనే సేసినాడు. ఆ మడిసి నాలుగు దిక్కులా సూసి, 'సరి నన్ను సేసీనావు. బాగున్నాది. మరి ఉప్పుడు నానేటి సేసీది? సేయటానికేటున్నది?' అనడిగినాడు.

బెమ్మగోరికి ఆడిబాద అర్తంవయినాది. మరి ఆ బాబు గూడ తోచనం నేదనే గంద మడిసిని సేసిన్ది. అందుసేత ఒక గోవుని సేసిచ్చి 'దీన్ని సాక్కో' అని సెప్పినాడు. అప్పటికి గోవుమాలచ్చిమినాగే మడిసి కూడా సాన సాదువు.

"మడిసికి అది సాల్నేదు. గొడ్డుకేటున్నాది. ఏలకింత గడ్డి ఒడేస్తే తినీసి కునుకుతాది. ఆడు రోజంత ఏటి సేస్తాడు?"

"బెమ్మగారు ఆలోసించి, ఓ గాడిదని సేసిచ్చేడు. ఇదుగో. సెరువుకెల్లి బట్టలుతుక్కో అని సెలవిచ్చినారు."

ఈమనిషికి బట్టలెక్కడివి? నేతగాళ్ళూ, మగ్గాలూ, అవి చేసేవాళ్లూ … ఇలా చాలా హంగులుండాలి కదా అనబోయి ఊరుకున్నాను. రాయసగాళ్ళకి ఎదురు ప్రశ్నలడిగే హక్కు లేదు.

సంద్రాలు కత కొనసాగించింది, “గాడిదికోసం గడ్డీ గాదం వొగు సేసి ఎట్టేడు గానీ ఆటికి కాపలా గావాల గంద. అందుకని ఓ కుక్కని సేసినాడు. ఆ కుక్క ఎంత సక్కగ యజమానులోరికి ఇస్సాసంగ ఉండి గడ్డి గాదంవే గాక ఇల్లువోకిలి గూడ గనిపెట్టుక సూసుకుంటా ఉండీది.“

ఇలా సంద్రాలు వొడిగించుకుంటూ వొయింది కథ మూడుగంటలసేపు. అదంతా రాయడం కష్టం కనక సూక్ష్మంగా కథ చెప్తాను.

శ్రీ సృష్టికర్త ఒకొక జంతువుని తయారు చేసుకుంటూ వొయేడు. అది ప్లాను అవునో కాదో తెలీదు కానీ ఒకొక జీవికీ ఒకొక గుణం కూడా నిర్ణయం అయివొయింది.

గోవు సాధువు

కుక్క విశ్వాసం

గాడిద చాకిరీ

ఉడత నిలువ చెసుకునేబుద్ధి

కోతి అస్థిరం

కోడి సూర్యోదయస్ఫూర్తి

నెమలి నృత్యం

కోకిల మధురస్వరం

పిల్లిశకునం

పిట్టకూత ఘనం

ఏనుగు మదము

జలగ రక్తం పీల్చేగుణం

ఉడుంపట్టు

నక్క జిత్తులు

దోమజోరు

నల్లికుట్లు

ఈవిధముగా సమస్త జీవులకు ఒకొక గుణంచొప్పున వొంతం చేసేసేడు.

మరి మనిషికి ఏం చేసేడు?

“అదే సెప్తన్న. గునాలన్నీ మంచీ సెబ్బరా పసూలకి పచ్చులకీ పంచినయెనక మరేటీ నేదు. అందుసేత బెమ్మ విస్నువుని అడిగినాడు “ఉప్పుడేటి సేయాల?” అని. అయన మమ్ములుగ

యన్నీవోరినాగ సిన్న నవ్వు నవ్వి ఏమి సెలవిచ్చినారంటే, "నాయ్నా, నీకు మితంగా గునాలు పెసాదించితి. నువ్వేంవో అడ్డూ అదుపూ నేకండ అయన్నీ పసూలకి పంచిపెట్టీస్తివి. తొట్టతల్ల నీవు మడిషిగురించి గద ఆలోసించాల్సింది."

ఇలా ఇంకొంచెం వివరించింది. మాపాఠకులలో కొందరికి ఈ తూర్పు భాష పట్టుబడని నాకు విదితమే కనుక ఆ ఉపన్యాసం సారాంశం "మన" మాటల్లో చెప్పడానికి ప్రయత్నిస్తాను.

సకల జన్మములలో మానవజన్మ ఉత్తమము కనక సమస్తగుణాలు మనిషికి ఉంటే వాటిని గూర్చిన అవగాహన ఉండగలదు, తద్వారా సమస్త చరాచరప్రపంచాన్ని, భూచరులని ఖేచరులనీ చక్కగా అర్థం చేసుకుని అదుపులో ఉంచగలడని బ్రహ్మ ఆలోచించి అలా సకలచరాచరములలో ఒకొక ప్రాణిగుణంనుండి కొంచెం గిల్లి ఆ ముక్కలన్నీ కలిపి ఒక మిశ్రమము తయారు చేసి మనషి మెదడులో కూరేడు.

అలా చేయుటలో బ్రహ్మ, విష్ణువుల ఆంతర్యము ఉత్తమజన్మమును పొదిన మానవుడు తన గుణములను చక్కగా గ్రహించి, సద్వినియోగము చేసుకొనగలడని చెప్పెను కదా. అక్కడే ఆ మేధావులిద్దరూ పప్పులో కాలు వేయుట జరిగినది.

బ్రహ్మ తయారు చేసిన మిశ్రమము వికటించి, chemical reaction మూలంగా మనిషి మెదడులో బంగాళాఖాతములో వాయుగుండమువలె అలజడి చెలరేగినది. మానవుడిబుద్ధీ మనసూ మొత్తము గందరగోళము అయిపోయినవి.  ఆగుణములను అదుపులో ఉంచుకొను మార్గము కనిపించలేదాయనకి. మనిషి గుణమును అదుపులో పెట్టడానికి బదులు ఆ గుణములే మనిషిని అదుపులోనికి తీసుకుని స్వారీ చేయసాగినవి. వాటిలో అవే వంతులు వేసుకొని తమ ఇచ్చవచ్చిన రీతి చెలరేగసాగినవి.

అదెలా జరిగిందంటే -

నువ్వంటే ఇష్టం అంటాడు. మక్కలిరగ తంతాడు. లేదా ఎకసక్కేలాడతాడు. దయ అంటాడు. చెయ్యి చాపి గుప్పిడి మూసేస్తాడు. నేను మంచివాణ్ణి అంటాడు. తిరిగి చూస్తే అన్నీ కుళ్ళుబుద్ధులే. నెమ్మది అంటాడు. కోతిలాగ కుప్పిగెంతులేస్తాడు. పని ఇప్పిస్తానంటాడు. ఇప్పించేను కనక నాగుమ్మంలా కుక్కలా ఆజన్మాంతం పడుండు అంటాడు. ఇలా అందీపొదని గుణాలు ఎదతన్నుకొచ్చి అతనికే తెలీకుండా మారిపోయేడు.

ఆవ్విధమున మనిషి గుణములను ఎలా వినియోగించుకోవాలన్నది సరిగా అర్థము చేసుకోలేక ఆ గుణాలకి తానే దాసుడయిపోయేడు. పశుపక్ష్యాదులు అలా కాదు. అవి ఒక్కటే గుణము గలవి కనక ఆయా గుణములకు అనుగుణముగా ప్రవర్తిస్తూ తాము సుఖపడి, మనని కూడా సుఖపెడుతున్నాయి. కనీసం సుఖపెట్టడానికి ప్రయత్నిస్తున్నాయి అని ఋజువైపోయింది.

వాటిని చూసి అయినా నేర్చుకుందాం అన్నైనా లేదు మనిషికి అంది సంద్రాలు ఆఖరిమాటగా. అదమ్మా కథ. సూక్ష్మంగా “మనిషికి బుద్ధి లేదు. పశువులకు బుద్ధి గలదు.”

000

(ఆగస్టు 30, 2017)

# 4. తననిగురించిన నిజం! (కథ)

యాజులుగారు చేతిలో కాగితం తేరి చూస్తూ ఏమని జవాబిస్తే బాగుంటుందా అని ఆలోచనలో పడ్డారు. తాను పెద్దవాడినయిపోయేనని చెప్పుకోడం ఆయన్నెప్పుడూ బాధించలేదు . ఎవరైనా అడిగితే వయసు చెప్పడానికి ఆయనకి అభ్యంతరం లేదు కానీ పెద్దవాడిని కనక ఈ పని చేయలేను అని మాత్రమం ఎప్పుడూ చెప్పరు. ఎందుకంటే కానీ ఆమాట విన్నప్పుడు ఎదటివరాు ప్రదర్శించే భావముద్రలు చిరగ్గా ఉంటాయి ఆయనకి. ఇప్పుడు కోర్టు అంపిన ఈ కాయితానికి సమాధానంగా చెప్పవలసి వస్తోంది. అది జూరీ డ్యూటీకి రమ్మని తాఖీదు.

వయసు మీద పడడం ఆయనకి తెలీకా కాదు, తేదేదో బాధపడవలసిన విషయం అనీ కాదు. చూడడానికి పుష్టిగా ఉత్సవవిగ్రహంలా ఉంటారు కనక వయసు అడిగినవారు అంతపెద్దవారిలా కనిపించరంటూ ఆశ్చర్యపడడం ఆయనకి సరదాగానే ఉంటుంది. ఇదొక వింతగా వినిపించవచ్చు కానీ ఈకాయితమ్ముక్కమీద ఆవిషయం చెప్పుకుంటుంటే ఆయనకే కొంచెం కొత్తగా తోచింది. అప్పుడే మనసుకి బలంగా తగిలింది.

ఇంతకు పూర్వం …

పెద్దవారయిపోతున్నారు, మాదగ్గరొచ్చి ఉండండి అని కొడుకులు చెప్పినప్పుడు నాకు ముసలితనం వచ్చింది అనుకోలేదు.

బస్సులో తనకంటె చిన్నవారు, “తాతగారూ, రండి ఇక్కడ కూర్చోండి,” అంటూ చోటు ఇచ్చినప్పుడు తోచలేదు.

“పెద్దవారు మీరే అలా అంటే ఎలా?” అంటూ ఇరుగూ పొరుగూ పాఠాలు వల్లించినప్పుడు అనిపించలేదు.

వీధిమెట్లమీద తూలి పడబోతే, ఎవరో ఆచి పట్టుకుని, “జాగ్రత్తండీ, మీరు చేతికర్ర పట్టుకు నడిస్తే మంచిది,” అని సలహాలు చెప్పినప్పుడు కూడా మనసులో అది నాటలేదు.

అంతర్జాలంలో వృద్ధులయాతనలూ, వృద్ధాశ్రమాల విశేషాలూ ప్రత్యేకమెయిలులు వచ్చినప్పుడు కూడా ఆయనలో ఏ చలనమూ లేదు.

వీటన్నటికీ వెనక కారణం ఒకటే. పెద్దవారయిపోయినట్టు కనిపించకపోవడం. తనపనులు తనే చేసుకుంటూ, ఎవరిమీదా ఆధారపడకుండా, కడుపులోచల్ల కదలకుండా జరిపించేసుకోగల అదృష్టం ఆయనకి ఉండడం. తనవయసు ఎంతైనా “వృద్ధుడు,” అనిపించుకొనవలసిన అవుసరం

కనిపించలేదు. అంటే వృద్ధాప్యం అంటే చిన్నచూపు అని కాదు. ఆ పదంతో అంతర్లీనంగా ప్రజలకి ఉన్న అబిప్రాయాలు తట్టుకోలేక మాత్రమే.

తనకి వయసు మళ్ళిందని మొట్టమొదట అనుకున్నది యాభయ్యో పడిలో పడ్డాక. తనవయసువాళ్లంతా అప్పటికే సులోచనధరులు. తనకి లేనందుకు ఆశ్చర్యం వెలిబుచ్చి, కాంటాక్ట్ లెన్సులేమో అని సందేహం వెలిబుచ్చి, అదృష్టవంతుడివిరా అంటూ అక్కసు వెలిబుచ్చడం ఆయనకి అలవాటయి పదేళ్లయింది.

ఆరోజుల్లోనే సరే, చూదాం అని కళ్ళడాక్టరు దర్సనం చేసుకున్నారు. ఆ డాక్టరు పరీక్షించి, prescription రాసిచ్చేడు. అవి ఆయనకి అచ్చిరాలేదనే చెప్పాలి. జేబులో పెట్టుకు తిరగడం, ఎప్పుడో గుర్తొచ్చినప్పుడు మొహానికి తగిలించుకోడమే కానీ, కళ్ళజోడు లేకపోతే జరగదన్న బాధ లేకపోయిందాయనకి.

ఓరోజు బస్సెక్కి, అలవాటుప్రకారం జేబులోంచి అద్దాలు తీసి తగిలించుకుని కిటికిలోంచి చూస్తూ కూర్చున్నారు. కొంతదూరం వెళ్ళేక అవి తీసి చేత్తో పట్టుకుని, కిటికీలోంచి చెట్లూ పుట్టలూ చూసేరు. బస్సు దిగి, ఎవవరితోనో మాటాడుతూ కొంచెం దూరం నడిచి, చేతిలో అద్దాలు లేవని గ్రహించినవారయి, వెనుదిరిగి చూస్తే, బస్సు చక్రాలకింద ముక్కలయిపోయిన కళ్లద్దాలు కనిపించేయి.

పక్కనున్నాయన, “అయ్యయ్యో నీ కళ్ళద్దాలు,” అన్నాడు.

యాజులుగారు, “అవును సుమా, నాఅద్దాలే. అవి నామొహాన లేకపోయినా గాజుముక్కలు కనిపిస్తున్నాయి,” అన్నారు చిన్నగా నవ్వి.

స్నేహితుడు ఆమాట వినిపించుకోకుండా.”ఏమిటాలోచిస్తున్నావు, ఇప్పుడు మళ్ళీ ఖర్చు అనా?” అన్నాడు.

“లేదు. ఆజోడులో నామొహం ఉంటే నామొహం కూడా చితికిపోవును కదా అని,”

స్నేహితుడు కొంచెం తికమకయి తరవాత తను కూడా నవ్వేసేడు.

యాజులుగారు తనకి సులోచనములు అక్కర్లేదని తెలుసుకున్నారు ఆవిధంగా.

రెండోసారి నాలుగేళ్లక్రితం, అమెరికా వచ్చేక, కారు తోల్తున్నవేళ వీధిపేర్లు సరిగా కనిపించడంలేదని అనుమానం కలిగినప్పుడు. అప్పటికి అరవయ్యో పడిలో పడ్డారు.

కళ్ళడాక్టరుని దర్శించుకుంటే, యథావిధిగా పోచికోలు కబుర్లు చెప్తూ అన్నిరకాల పరీక్షలు పక్కాగా చేసి, ఆయన కొనుక్కోవలసిన కళ్ళజోడు వివరాలు రాసిచ్చేరు. దానికి తగ్గ ఫ్రేము కూడా వారిదగ్గరే కొన్నారు వెరసి 400 పైనే తగలేసి. ఆ కళ్లజోడు శుభ్రపరుచుకోడానికి ఓ చిన్నసీసాలో ఏదో ద్రవం ఇచ్చేరు. అది ఉచితంట. సీసా ఖాళీ అయిపోయినప్పుడల్లా మళ్లీ నింపుతాం

ఉచితంగానే జీవితాంతం అని హామీ కూడా ఇచ్చేరు. ఎటొచ్చీ ఆయనకి అచిరకాలంలోనే తెలిసిన రెండు విషయాలు ఇక్కడ అవశ్యం చెప్పుకోవాలి. 1. ఆ కళ్ళజోడు కూడా పూర్వంలాగే పెట్టుకున్నా పెట్టుకోకపోయినా కనిపించే దృశ్యంలో అట్టే తేడా లేదు. 2. ఏడాది తిరక్కుండా దాంతో వచ్చిన ద్రవం అలాగే ఉంది కానీ ఫ్రేము విరిగిపోయింది. దృశ్యంలో తేడా లేదు కనక పోస్ పొమ్మని ఊరుకున్నారు.

మళ్లీ ఈఊరొచ్చేక పరీక్ష చేయించుకుందామా ఒద్దా అని సుదీర్ఘమైన ఆలోచన చేసి, DOTవారు కారు తోలడానికి “లైసెన్సు ఇవ్వం” అన్నప్పుడు చూడొచ్చులే అని ఊరుకున్నారు. ఇక్కడ మరోమాట కూడా చెప్పాలి. అమెరికాలో డ్రైవరులైసెన్సు కారు నడపడానికి మాత్రమే కాదు. అది నువ్వు నువ్వే అని ధృవపరచడానికి కూడా అవుసరం. అంచేత యాజులుగారి రెండోకొడుకు డిఓటీకీ తీసుకెళ్లి లైసెన్సు ఇప్పించేడు. అక్కడ డిఓటీవారు ఏపేచీ లేకుండా లైసెన్సు ఇచ్చేసేరు.

మరో మూడేళ్ళతరవాత టీవీలో టెనిస్ చూస్తుంటే స్కోరు స్పష్టంగా కనిపించలేదు. మొదటిరోజు టీవీ కొంచెం ముందుకి జరిపేరు. రెండోరోజు ఇంకొంచెం ముందుకి జరిపేరు. క్రమంగా టీవీ ఒడిలో పెట్టుకోవాలేమో అనిపించే స్థితికి వచ్చేరు. అక్కడికీ ఆశ చావక, సులోచనములు ధరిస్తున్న మిత్రులనడిగేరు, కారు తోలనివారికి ఎల్లవేళలా కళ్ళజోడు ధరించే అవుసరం ఏముంటుందని. అప్పుడు తెలిసింది మైనస్ 9 నించి మైనస్ నాలుగు అయినా తప్పనిసరి అని. చదవడానికి చత్వారంజోడునించి, దగ్గర, దూరం, చాలా దూరం ఇలా అనేక జోళ్ళు అవుసరమవుతాయి అని తెలుసుకున్నారు. అదీ ఎండలో తిరిగేటప్పుడు తగిలించుకునే నల్లద్దాలు కాక.

ప్రస్తుతం LCD తెరమీద రాతలు చదవడానికి కూరలబజారులో కొన్న అణాకాణీ చత్వారం జోడు ఉంది కానీ అది కూడా ముక్కుమీద ఉండనివ్వరు. మొదట ముఖానికి తగిలించుకు, రెండు నిముషాలయేక తీసి పక్కన పెట్టేసి, చదివేస్తూంటారు. చాలాసార్లు అసలు ఎప్పుడు తీసి పక్కన పెట్టేస్తున్నారో ఆయనకే తెలీదు.

ఒక వారాంతం చిన్నకొడుకు వస్తే, సూచనప్రాయంగా తన సంశయం చెప్పేరు. అతను వెంటనే, సరే పరీక్ష చేయిస్తాను, డాక్టరేమంటాడో చూదాం అన్నాడు.

రెండు రోజులాగి, యాజులుగారు పరీక్ష చేయించక్కర్లేదని చెప్పేసేరు. ఏమంటే, టెనిస్ అయిపోయింది కనక స్కోరుగోల లేదు. టీవీలో కనిపించి ఇతర ముఖాలు స్పష్టంగా చూడాలన్నకోరిక ఆయనకి లేదు. అసలు చూడకుంటేనే బాగుండనని కూడా ఉంది.

ఇదీ ఇంతవరకూ వారి దృష్టిబలం కథ. "పెద్దవారు" కావడానికీ కళ్ళజోడు కావలసిరావడానికీ ఏమీ సంబంధం లేదని ఋజువు చేసిన కథ.

ఇప్పుడు సుపీరియర్ కోర్టువారు జూరీ డ్యూటీకి వారిని ఎంచుకున్నారనీ. ఫలానారోజున ఫలానాచోట హాజరు కావలెననీ తాఖీదు పంపేరు. ఆకాగితంలోనే "నీకు వీలు కాకపోతే ఎందుకు వీలు కాదో చెప్పు" అని కూడా చెప్పేరు. ఆ విధంగా యాజులుగారికి తాము జూరీ ధర్మం నిర్వర్తించడానికి ఎందుకు అర్హులు కారో చెప్పుకోవలసిన అవుసరం కలిగింది.

ఆవిధంగా ఆయన సుదీర్ఘంగా సూక్ష్మదృష్టితో ఆత్మావలోకనం మొదలయింది. తనకి అనేకవిధాల ప్రజాసామాన్యంలో గల "పెద్దవాడు, ముసలివాడు," లక్షణాలు లేకపోయినా, కోర్టువారికి తాను పెద్దవాడినని చెప్పుకోవలసివచ్చింది. మామూలు పరిస్థితులలో పెద్దతనం ఒక అవరోధంగా అంగీకరించరు. జూరీధర్మం తప్పించుకోడం అంత తేలిక కాదు. అసలు తనకి తప్పించుకోవాలని కోరిక కూడా లేదు. ఆయన అపరాధపరిశోధకనవలలు, సినిమాలూ, కోర్టు టీవీలు చాలా ఇష్టంగా చూస్తారు. అనేకమార్లు జూరీగా అవకాశం వస్తే బాగుండు అని కోరుకున్నారు. ప్రస్తుతం విచిత్రమైన పరిస్థితిలో పడ్డారు. భగవల్లీల!

చిన్న నిట్టూర్పు విడిచి, మరో కాయితం తీసుకుని ఏమి చెప్పవచ్చో ఆలోచిస్తూ రాయడం ప్రారంభించేరు.

– నాకు స్థానిక యాస, నుడికారం పట్టుబడలేదు. (ఈ దేశంలో చాలాకాలంగానే ఉన్నా, సమాజంలో అట్టే మెలగలేదు కనక అది అగమ్యగోచరంగానే ఉండిపోయింది)

– నేను కారు నడపను. (ఆయన ఈ ఊరొచ్చేక, ఇక్కడ జనాలు కార్లు నడపడం చూసి అదిరిపోయేరు. వంద డప్పులమోతకి ఝుడుసుకు చెదిరిపోయే గేదెలమందలు గుర్తుకొచ్చేయాయనకి మొదటిరోజునే. మొన్నటికి మొన్న ఏ రద్దీ లేని పక్కవీధిలో ఓ కారు రోడ్డుపక్కనున్న మరోకారుమీదకి ఎక్కేసింది. అక్షరాలా ముందు చక్రం రెండోకారు డిక్కీమీద ఉంది ఆయన చూసేవేళకి. అసలది ఎలా సాధ్యమో ఎంత ఆలోచించినా అర్థం కాలేదాయనకి.)

– మాటాడుతున్నప్పుడు ఎదటివారిని మళ్ళీ చెప్పమని అడగవలసివస్తుంది తరుచూ. (స్వతస్సిద్ధంగా ఎవరితోనైనా మాటాడుతున్నప్పుడు, వాళ్ళేం చేప్పేరో అర్థం చేసుకోడానికి కొంత సమయం పడుతుంది. వాళ్లఇంగ్లీషు మరోసారి మనసులో మననం చేసుకుని దాన్ని తెలుగులోకి తర్జుమా చేసుకుని, జవాబు ఆలోచించి, దాన్ని ఇంగ్లీషులోకి అనువదించుకుని చెప్పవలసివస్తోంది.)

– ఒకచోట కదలకుండా అట్టేసేపు కూర్చుని ఉండడం నాకు సాధ్యం కాధు. (గంటా గంటన్నరసేపు ఒకేచోట కదలకుండా కూర్చోడం తనకి అసాధ్యం. అందుకే ఆయన సినిమాలకి వెళ్ళరు. ఇంట్లో టీవీ చూస్తున్నప్పుడు కూడా లేచి అటూ ఇటూ తిరుగుతుంటారు.)

– ఆహారనియమాలు ఉన్నాయి. (అందరిలాగా పద్ధతిగా రోజుకి మూడు పూటలు బల్లదగ్గర కూర్చుని కడుపునిండా తినడం మానేసేరు ఇక్కడికొచ్చేక. తిండి కాలక్షేపం అయిపోయింది. గంటగంటకీ దవడాడాల్సిందే. అలా అలవాటయిపోయింది. అది మార్చుకోలేరిప్పుడు. మరి కోర్టులో కూర్చుంటే అది జరగదు.)

– నావయసు 80 సంవత్సరములు. (పైన చెప్పినట్టు వయసు లెక్కలోకి రాకపోయినా, ఈ కారణాలవెనక వయసు ఉంది అని చెప్పడం అవుసరం.)

యాజులుగారు ఆగి మరోమారు తాను రాసినవి చదువుకున్నారు. ఆయన చెప్పుకున్న ప్రతి ఒక్క కారణమూ కటికసత్యమే.

మరి ఎక్కడ తిరకాసు అంటే ఇవి “ముసల్తనం”గుర్తులుగా ఆయనమనసుకి తోచలేదు. కానీ ఇలా అక్షరగతం చేసి చూసుకుంటే, నేను పెద్దవాడిని అని బొమ్మ కట్టింది కట్టెదుట.

తననిగురించిన తనకి గల దృష్టికీ, తనగురించి మిగతావారికి గల దృష్టికీ అదీ వ్యత్యాసం. ఇప్పుడు ఈ విషయం కోర్టువారికి చెప్పుకోవలసిరావడంతో తననిగురించి తనకి ఏదో కొత్తగా తెలిసినట్టుంది.

ఇంతవరకూ దృష్టి మారితే దృశ్యం మారుతుంది అనుకున్నారు. ఇప్పుడు దృశ్యం మారితే దృష్టి మారడం కూడా జరుగుతుంది అని అర్థమయింది.

యాజులుగారు నిరామయంగా కోర్టువారికాయితం తీసుకుని తాను జూరీధర్మం నిర్వర్తించలేకపోడానికి కారణాలు యథాశక్తి వివరించి, కలం బల్లమీద పెట్టేరు. అలవాటుప్రకారం చెయ్యి చెంపలవేపు సాగింది కళ్ళజోడు తీసి పక్కన పెట్టడానికి. అక్కడ జోడు లేదు. అది బల్లమీద కనిపించడంతో చిన్న చిరునవ్వొకటి ఆయనపెదవులమీద వెలిగింది!!

మనిషి తనగురించి తనకి తెలిసినప్పుడు కూడా ఆపార్శ్వాన్ని తనవ్యక్తిత్వంతో సంపూర్ణంగా సమన్వయం చేసుకోడానికి ఆత్మవిచారం అవుసరమవుతుంది.

ooo

(సెప్టెంబరు 26, 2017)

# 5. చిక్కటి కాఫీ ముచ్చట్లు (గల్పిక)

మీలో చాలామందిలాగే నేను కూడా కాఫీగతప్రాణిని. చిక్కని కాఫీ రెండు కప్పులు పడ్డాకే నాకు నిద్రమొహం వదిలేది. లేకపోతే ఇంకా అర్ధరాత్రిలాగే ఉంటుంది నాప్రాణానికి. దినకరుడు కూడా ముఖం చాటేసుకుంటాడు. ఏపని చేయబోయినా కలలో నడుస్తున్నట్టుంది. నిజానికి నన్ను ఆసమయంలో చూసినవారు, కాఫీ తాగే అలవాటు లేనివాళ్ళు కూడా, ఇట్టే పసి గట్టేస్తారు. పాపం, కాఫీ పడ్డట్టు లేదింకా అని జాలి పడతారు. చాలాకాలంగా నాబ్లాగు చూస్తున్నవారికి నాపాతటపా, కాఫీ రంగూ రుచీ, గుర్తుండే ఉంటుంది. కొత్తగా చేరినవారికోసం ఇదుగో లింకు, కాపీ రంగూ రుచీ.

ఇప్పుడు అంటే గత 5, 6 ఏళ్ళలో నాజాతకంలో గ్రహములన్నీ ఉచ్చదశలో ఉండుటచేత కావచ్చు ఒక అత్యద్భుతమూ, అమందానందకరమూ అయిన కాపీ పొడి దొరికింది. అది బుస్తెలోవారిది. ఆ పొడితో చేసిన కాఫీ మూలంగా మాయింటికొచ్చిన అతిథులు "మాలతి పెట్టిన కాఫీ ఎంతో బాగుంటుంద"ని చెప్పుకుంటారు. అందుకే కాఫీ సేవించనివారు మాయింటికి వస్తున్నారంటే నాకు చెయ్యి విరుచుకున్నట్టుంటుంది. ఏం చెయ్యాలో తోచదు.

ఇంతకీ అసలు కథ. ఇంతవరకూ మూడు చెంచాలు ఫిల్టరులో వేస్తే చిక్కని డికాషను పది నిముషాల్లో సిద్ధమయిపోయేది. కానీ గత రెండు మూడు నెలలుగా డికాషను మన అమెరికన్ నల్లకాఫీలాగే ఉంటోంది. అంటే నీళ్ళకాఫీ అన్నమాట. మొదట నాతప్పేమో అనుకున్నాను. ఫిల్టరు మరింత చక్కగా రుద్ది రుద్ది కడిగేను.

పొడి వేసేక పైగిన్నెలో strainerతో పొడి మరీ మరీ దట్టించేను. ఆఖరికి దానికాడ వొంగిపోయింది కానీ డికాషనులో మాత్రం తేడా లేదు. ఆఖరికి మరో చెంచాడు పొడి తగిలించేను. అపుడొచ్చింది వెనకటి కళ.

అప్పుడు తెలిసింది ఇది కంపెనీవారి కుట్ర అని. పొడి ఎంత మెత్తగా ఉంటే డికాషను అంత చిక్కగా దిగుతుంది. పొడి మొరుం మొరుంగా ఉంటే, గట్టు తెగిన ఏరులా గలగల కిందకి దిగిపోతాయి నీళ్ళు, పొడిలోని పసరు ఒంట పట్టించుకోకుండానే అన్నమాట. కాఫీ పొడి అసలు రహస్యం అది.

కొందరు చికోరీ కలుపుకుంటారు కానీ నాకంతగా నచ్చదు.ఇది కొంచెం విచిత్రమే. నాచిన్నప్పుడు, అంటే మరి చిన్నతనం కాదులెండి, 16, 17 ఏళ్లవయసులో విశాఖపట్నంలో ఉండేవాళ్లం. ఆరోజుల్లో నాఒక ఉద్యోగం బజారుకెళ్ళి కాఫీపొడి కొనుక్కురావడం. ఇప్పుడుందో లేదో కానీ విశాఖపట్నం కె.జి.హెచ్. డౌనులో విశ్వేశ్వరయ్యకాపీ దుకాణం అని ఒకటుండేది. అది

పిండిమరల్లాగే ఎవరికి కావలిస్తే వారు వారికి వలసిన రీతి చెప్తే ఆదుకాణదారు కాఫీగింజలు పొడి చేసి ఇచ్చేవారు. కాఫీపొడి అయిపోయినప్పుడల్లా అక్కడికి వెళ్ళి మాఅక్కయ్య చెప్పిన పాళ్ళు చికోరి కలిపిన కాఫీపొడి చేయించుకు రావడం నాపని. బహుశా 20 పాళ్లనుకుంటాను సరిగా జ్ఞాపకం లేదు కానీ చికోరి పాళ్ళు మేమే నిర్ణయించుకోడం మాత్రం గుర్తుంది. బహుశా ఈనాటి నా నిత్యసంచారానికి కూడా ఆ నడకే నాంది ఏమో.

ఇహ చికోరీమాట. అప్పట్లో ఆకాఫీయే ఇంట్లో అందరం తాగినమాట వాస్తవమే అయినా అమెరికాకి వచ్చేక నాకు ఆ చికోరీయావ లేకుండా పోయింది. ఆ తరవాత నేను చేసినప్రయోగాలన్నీ చెప్పను కానీ ఈ బుస్తెలోవారు చికోరీ లేకనే అంతటి చిక్కటి కాఫీ ఏర్పాటు చేస్తున్నారని తెలిక నాప్రాణం తేలికయింది. భారతీయ దుకాణాలలో చికోరీ కనిపించినప్పుడల్లా చిన్ననాటి కథలు తలుచుకున్నా, కొనడం మాత్రం చేయలేదు. ఆ దుకాణాల్లో 1,2 సార్లు కాఫీ కొన్నాను కానీ ఆ చికోరిరుచి నాలుక్కి తగిలి చికోరీ అంటే అస్సలు ఇష్టం లేకుండా పోయింది. అది పైత్యం పెంచుతుందని కూడా నా అనుమానం. అంతే కాక, మనవాళ్లు నిజ చికోరీ మొక్కనుండి తయారు చేసిన పొడికి బదులు చింతగింజలో కొబ్బరి చిప్పలో కాల్చి, ఆ బూడిద కాఫీపొడిలో కలిపి అమ్ముతున్నారని కూడా విన్నాను.

ఈ అన్ని కారణాలవల్లనూ సంఘటనలవల్లనూ బుస్తెలో వారు రెసెపీ మార్చేయడం నాకు చాలా కోపం తెప్పించింది. ఏతత్కారణంగా వారికొక ఘాటయిన ఉత్తరం రాసేను.

ఇదుగో ఆలేఖ మీకు కూడా చూపిస్తున్నాను నేను నిజంగా కోర్టుకెక్కవలసి వస్తే, మీరు సాక్ష్యం.

000

బుస్తెలో కంపెనీకి బహిరంగలేఖ

అయ్యా.

మీకాపీ పొడి నేను 6 సంవత్సరములుగా వాడుతున్నాను. ఈవిధంగా నాకు మీకాఫీ వ్యసనము అయిపోయింది. ఇటీవల నాకాఫీ చిక్కగా రావడంలేదు. నేను తీవ్రంగా యోచించి, పరీక్షించి నిర్ధారణ చేసుకున్నది మీరు రెసిపీ మార్చిపేసేరు అని. మూడు చెంచాలతో సరిపోయేది ఇప్పుడు నాలుగు చెంచాలు వేస్తే కానీ ఫిల్టరులో చిక్కగా డికాషను రావడం లేదు.

ఇందువల్ల పదిరోజులు వచ్చే పేకెట్ ఇప్పుడు ఏడురోజులకే అయిపోతోంది. అంటే నేను పదిరోజులకి ఒకసారి కాక 7 రోజులకొకసారి కొనవలసివస్తోంది. అంటే నేను ఎక్కువసార్లు బజారుకి వెళ్లవలసివస్తోంది. అంటే నాకారు ఎక్కువ అరిగిపోతోంది. నాకు ఎక్కువ సమయం ఖర్చు

అవుతోంది. వీటన్నిటిమూలముగా నాకు అమితముగా మనస్తాపము కలుగుతోంది నాదినచర్యలకున్నూ ఆకటంకము కలుగుతోంది. ఇది మీకుట్రగా భావిస్తున్నాను.

మీ ఈ దుశ్చర్యని, ముఖ్యముగా నావ్యసనానికి కారణమైనందున, తీవ్రంగా ఖండిస్తూ, మీమీద నేను చర్య ఎందుకు తీసుకొనకూడదో నాకు సమ్మతము కాగలరీతిని సమాధానము ఇవ్వగలరు.

అట్టి సమాధానము ఈఉత్తరము అందిన 7 దినములలో నాకు చేరనపక్షమున, నేను కోర్టులో నా అసమ్మతిపూర్వకమైన నేరారోపణ చేస్తూ కాగితములు దఖలుపరచగలనని గమనించవలసిందిగా ఈలేఖద్వారా తెలియజేయడమైనది.

ఇట్లు

నిరాశాపూరిత వాడుకరి.

000

లేదు. వారినుండి జవాబు రాలేదు కానీ కాఫీపొడి మళ్లీ మారినట్టుంది నాకు ఇష్టమైనవిధంగా.

000

(నవంబరు 17, 2017)

# 6. నోటు దొరికింది (గల్పిక)

"ఏంటది అలా పట్టుకు తిరుగుతున్నావు?" అన్నాను సంద్రాలు చేతిలో నోటు చూస్తూ

నాల్రోజులక్రితం దారిలో దొరికిందిట.

నాకర్థం కాలేదు. నాల్రోజులకిందట దొరికింది ఇంకా ఇవాల్టికి కూడా చేత్తో పుచ్చుకు తిరగడమేమిటని. అదే అడిగేను.

"నివ్వు ఏదీని సలవా సెప్తవని ..."

"చెప్పడానికేఁవుంది. సిరి దా వచ్చిన వచ్చును అన్నారు కొబ్బరినీళ్ళలా అలా గలగలా దానంతటే వచ్చేస్తుందిట నీకు ప్రాప్తం ఉంటే."

"ఓరో పారేసుకున్నారేఁవోనని."

"ఎవరిదో ఏమిటి. సాక్షాత్తు కోరి లక్ష్మీదేవి నీకాళ్లముందు వచ్చిపడింది కనక నీదే."

ఆక్షణంలో నాకది దొరకనందుకు కొంచం అక్కసు కూడా కలిగింది. మరి రోజూ నేనూ ఆదారంటే నడుస్తాను కదా. నాకళ్ల పడేవి రాగి పైసలే. రాగి రాగోరుతుందని ఒకట్రెండుసార్లు ఏరి తీసుకున్నాను కూడా. నాబతుకు ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే, గొఱ్ఱెతోక బెత్తెడే అన్నట్టు ఉందనీ, ఎప్పటికీ అలాగే ఉంటుందనీ గ్రహించేక, పైసా కాదు పావుడాలరయినా దాటుకుపోతున్నాను దర్జాగా.

"అదిగాదు. నాను సాలా ఆలోసన్లు సేస్తన్న."

"ఏమున్నాయి ఆలోచన్లకి. వేలూ లక్షలూ అయితే ఎవరిదో అని వెతుక్కుంటూ వెళ్లడం న్యాయం. పోలీసుస్టేషనుకెళ్ళి, "ఇదుగో. ఈడబ్బు నాది కాదు, ఫలానాచోట ఫలానా సమయంలో దొరికింది. వాకబు చేసి ఎవరిదో వారికి అందజేయండి అని ఇచ్చేయడం ధర్మం. ఈ ఇరవై డాలర్లు పట్టుకు ఊరంతా తిరుగుతావేమిటి?" అన్నాను నాతెలివితేటలకి నేనే మురిసిపోతూ. నేనే అని మరోమారు నొక్కి చెబుతున్నా. నామాట సంద్రాలికి రుచించలేదు.

కళ్ళు చిట్లించి, చేతిలో నోటు పరీక్షగా చూస్తూ, "ఓరు పారేసుకున్నరో, ఎంత అతలాకుతలం అయిపోతన్నరో," అంది సాలోచనగా.

"చిలకజోస్యం అడిగిచూడు," అన్నాను నాచిరాకు దాచుకుని.

సంద్రాలు నావేపు గుర్రుగా చూసింది.

"ఎనకోపాలి మాయప్ప అదేలే ఇస్కూలికెల్లెదినాల్లో మాయమ్మ పొతకం కొన్నానికి రొండు రూకలిస్తే పారేస్కున్నది. ఆమీన పంతులోరు పాటాల్నేవు పోఅంట తగిలీసీరు."

నిజమే. పలకపుల్లకో చిరుతిళ్ళకో ఇచ్చే చిల్లర పారేసుకున్న పిల్లలెందరో.

ఆమధ్య ఒకావిడ మాల్లో చేతిసంచీ పోయిందంటూ దీనంగా మాలు దుకాణాలన్నీ తిరగడం గుర్తొచ్చింది. వాళ్లమ్మకి మందు కొనుక్కోడానికొచ్చిందిట డాక్టరుబాబు రాసిచ్చిన కాయితమూ, డబ్బూ కూడా పోయేయని గడబిడ పడిపోయింది. నాకు మూడు రోజులు పట్టింది ఆ సంఘటన మర్చిపోడానికి.

"అంత బాధగా ఉంటే ఎక్కడ దొరికిందో అక్కడే పడేసి రా. పోగొట్టుకున్నవారు మళ్ళీ వెతుక్కుంటూ వస్తారు."

"నేనదీ అనుకొంటి నప్పుడే. మల్ల నాకే నమ్మిక నేదు. ఏపోకిరీవోడి సేతల బడి, ఆడు యే సిగరెటుముక్కకో సీసాకో తగలేయొచ్చు గంద. ఈరోజల ఓరినీ నమ్మనేం. నచ్చాదికారికి గూడ ఆసే తేరగ వస్తాదంటే. అసలు ఆలకే మరింకా ఆబ."

"హ్మ్. అన్నీ తెలిసిన నీకు నేను చెప్పేదేంటి. నువ్వే చూడు ఏం చేస్తావో," అన్నానాఖరికి.

"కాదులె. నివ్వే సూస్కో," అంటూ నామీదకి విసిరేసింది ఆ కాయితం.

అః అః అంటూనే నాఒడిలో పడ్డ కాయితం తీసుకుని, అట్టే చూసి తెల్లబోయేను.

"ఇదేమిటి. సగమే ఉంది?"

సంద్రాలు శిశిరంలో పండుటాకులు జలజల రాలినట్టు నవ్వింది.

"మిగతా సగం ఏం చేసేవు?"

"తెల్దు. నాకు అదె దొరికింది. ... నీకు బాంకుల కాతా ఉన్నిది గంద. ఆర్నడుగు."

ఆ నోటు పట్టుకు ఆలోచిస్తూ కూర్చున్నాను. చూస్తున్నకొద్దీ ఆశ్చర్యంగా ఉంది. అంత ఖచ్చితంగా ఎవరో పని గట్టుకు మడత పెట్టి చింపినట్టుంది. అదెలా సాధ్యమో నాకర్థం కాలేదు.

డబ్బు పోగొట్టుకున్నవాళ్లూ, మళ్లీ తిరిగి పొందినవాళ్ళూ, దానివల్ల నష్టపోయినవాళ్ళూ, చిన్నమొత్తం పోగొట్టుకున్నవాళ్లూ, మొత్తం దివాలా తీసినవాళ్ళూ ... ఎందరో నిర్భాగ్యులూ, అభాగ్యులూ మనసులో మెదిలేరు. అయినా చూదాం అని అంతర్జాలంలో చూసి మరింత ఆశ్చర్యపోయేను. అమ్మో, 20 డాలర్లనోటు పారేసుకున్నవాళ్ళు ఇంతమందున్నారన్నమాట. ప్రతివారికీ అదే ప్రశ్న - ఇదేం చేయడం అని. సరిగ్గా సగం ఉంటే తూర్పుకి తిరిగి దణ్ణంపెట్టు అన్న సలహాలే ఎక్కువున్నాయి.

సగానికి మించినముక్క అయితే బాంకువారు పుచ్చుకుని, మరొకరు రెండోభాగం తెచ్చిన 20 వసూలు చేసుకుపోయిన జాడ లేకపోతే, నీకు ఆమొత్తం ఇస్తారుట. లేకపోతే, ఇలా ప్రతివారూ రెండు ముక్కలు చేసి, రెండు బాంకుల్లో మార్చుకోగలరని, అది ముందు జాగ్రత్తట.

కాదు, ట్రెజరీకి పంపుతే, వారు కూడా లెక్కలు చూసుకుని ఆమొత్తం నీకు ముట్టచెబుతారు. ఎటొచ్చి వారికి ఎలా పంపాలన్నవిషయంలో చాలా జాగ్రత్తలు పాటించాలి. ఏ సంచీజిప్పులోనో చిక్కుకుంటే సంచీతో సహా అతిజాగరూకతతో మరో పెట్టెలో పెట్టి, అది కదలకుండా మరిన్ని థెరో ముక్కలు అమర్చి ఫలానా చిరునామాకి పంపాలి. మరి ఏ కారుతలుపుసందుల్లోనో చేతిసంచీ చిక్కుకుంటే, కారు కూడా అలాగే పంపాలా? ఏమో మరి. ఎద్దు ఈనిందంటే దూడని పాకలో కట్టెయమనే రకాలు అధికారులయితే అంతే మరి.

ఇంతకీ ఇప్పుడీ అర్థ ఇరవై ఏమి చేయాలన్న సంశయం తెగలేదు. నాకు తెలుసు. ఈటపా చదివే చాలామందికి ఓస్ 20 బక్కులే కదా అనిపిస్తుంది. హా ఇరవయ్యా అని కన్నులింతలేసి చేసి అక్కజపడేవారు కూడా ఉంటారనే అనుకుంటాను. ప్రపంచ కాగితపు ద్రవ్యచరిత్రలో దీనికొక ప్రత్యేకస్థానం ఉంది. అటు తేలిగ్గా తీసిపారేసేంత చిన్నదీ కాదు, అయ్యో పోయిందని గుండెలు బాదుకునేంత పెద్దదీ కాదు.

ఎలా చూసినా సంద్రాల్ని కనుక్కుని అది ఎక్కడ దొరికిందో అక్కడే మళ్ళీ పెట్టేసి రావడమే మంచిదనిపించింది. ప్రాప్తం ఉంటే పారేసుకున్నవారికే దొరకొచ్చు. లేదా ఆ రెండోముక్క ఎవరికో దొరికి, ఈ ముక్క వారికళ్ళే పడొచ్చు. గుర్రం ఎగరావచ్చు.

లేచి, తలుపు తాళం వేసి సంచారానికి బయల్దేరేను. దారిలో అట్టే జనం లేనిచోట చేతిసంచీలోంచి అర్ధ నోటు తీసి, నెమ్మదిగా జారవిడిచేసి గబగబ ముందుకి సాగిపోయేను. వెనక వస్తున్నవారెవరైనా ఇదుగో మీనోటు పారేసుకున్నారంటూ నాకిస్తారేమోనని భయం.

ప్రాణం తెరిపిన పడింది. దారిలో బెంగాలీదుకాణం కనిపించింది ఖాళీగా. సాధారణంగా ఎవరైనా ఉంటే వెళ్ళను. ఎవరూ లేరు కదా అని లోపలికి జొరబడి శనగపిండి, పచ్చిమిరపకాయలూ కొన్నాను. ఒక అర్థనోటు కలిగించిన అర్థంలేని చిరాకు వదిలించుకున్న శుభసందర్భంలో పకోడీలు చేసుకుందామని,

చిన్నదుకాణం కనక అతను క్రెడిట్ కార్డుకంటే సొమ్ముకే ఇష్టపడతాడు.

సంచీలోంచి నోటు తీసిచ్చేను. అతను అందుకుని క్షణం తేరిపారి చూసి, ఇదేమిటి అన్నట్టు నావేపు చూసేడు ఇదేమిటన్నట్టు.

చెప్పఖ్ఖర్లేదు కదా ఏమి పారేసనో!

ఎందుకైనా మంచిదని తిరిగొచ్చేటప్పుడు చుట్టుతిరిగి అయినా మరోవేపునించి ఇల్లు చేరుకున్నాను మళ్లీ ఆ సగం నోటు ఎదురుపడకుండా.

ooo

(నవంబరు 28, 2017)

## 7. చిన్నకష్టం చాలు బతుకుతీరు మార్చేయడానికి! (కథ)

జలజాక్షి ఆలోచనలో పడింది. యోగాసనాలు వేస్తూ ఒంటికాలిమీద నిలబడేసరికి కాలు కలుక్కుమంది. సరే రెండోకాలు దింపి, మళ్ళీ ఎత్తబోతే, మోకాలు చివ్వున లాగింది. పట్టలేనంత నొప్పి. విరిగిపోయిందేమో అనిపించేలా.

మెల్లిగా కుర్చీలూ, బల్లలూ ఆసరా చేసుకుంటూ వెళ్ళి మూలనున్న చేతికర్ర అందుకుని మళ్ళీ వెనక్కొచ్చి మంచంమీద వాలి ఆలోచించసాగింది.

ఇంతవరకూ ఎవరిని ఏ సాయం అడక్కుండా జరుపుకుంది. ఇప్పుడు ఆరోజు వచ్చెనా అన్న భయమే ఆమెని గజగజలాడించేస్తోంది. ఈనొప్పికి ఏ చికిత్స? యునానీ డాక్టరా? ఆయుర్వేదమా? కైరోప్రాక్టరా? సూదులా?

ఇప్పుడు అర్జెంటుగా ఊతకర్రలూ కావాలేమో. వాటికోసం ఎవరిని పిలవాలి? మరో సందర్భం అయితే తనే వెళ్ళి తెచ్చేసుకునేది. హాహా. తాను వెళ్ళగలిగితే అసలు ఆ కర్రల అవుసరమే ఉండదు కదా.

సమయానికి అమ్మాయి ఊళ్ళో లేదు కానీ ఉంటే వద్దన్నా వినకుండా వచ్చి, ఊతకర్రలూ, మందులూ, తిండికి కావలసిన సంభారాలూ అన్నీ సమకూర్చేది. ఆవెంటనే యమర్జెన్సీ వార్డుకి తీసుకుపోయేది. అదే తనకి అస్సలు ఇష్టం లేనిది. ప్రాణాలమీదికి వస్తే ఆస్పత్రిముఖం చూడదామె.

ఏంటో అదేదో పద్యంలో … హుం ఆఖరికి అది కూడా జ్ఞాపకం రావడం లేదు … అల్లునిరాక, ఇల్లాలిపురిటివేదన … ఇంతకీ అన్నీ ఒక్కసారే వస్తాయెందుకూ పెళ్ళివారిలా కట్టకట్టుకు. ఒకదాని తరవాత ఒకటి తీరిగ్గా, మధ్య మధ్యలో కొంచెం విరామం ఇస్తూ రావచ్చు కదా. అప్పుడు దేనికదే ఒకొక కష్టంమీద విడివిడిగా, సంపూర్ణంగా మనసు పెట్టి తగు సేవలు చేస్తాం. అన్నీ ఒక్కసారి ఉప్పెనలా విరుచుకుపడితే ఏం చేయగలం.

"సరే, మీరంతా నన్ను కష్టపెట్టడానికే కదా వచ్చేరు, మీరు కష్టపెట్టండి, నేను ఏమీ పట్టించుకోకుండా, మిమ్మల్ని లెక్క చేయకుండా, రాజెవరికొడుకన్నంత హాయిగా  సుఖపడతాను" అనుకుంటాను. లేదులెండి. ఊరకే కథకోసం అలా చెప్పొచ్చు కానీ నిజంగా అలా జరగదు. అలా నొప్పి మరిచిపోగలిగితే అసలది నొప్పే కాదు.

వీధిలో షికార్లకి విఘ్నం కలగడంతో జాలవిహారం ఎక్కువయింది. మోకాలు నొప్పి ఎందుకు వచ్చును, రెండుకాళ్ళకి పని సమానంగానే ఇస్తాం కదా ఒకమోకాలే ఇలా ఎందుకు పేచీ పెట్టును, అసలు దీనికి మూలకారణములేమి, వాటికి చికిత్సలేమి, ఏపనులు చేయొచ్చు, ఏవి చేయరాదువంటి అనేక విషయాలు తెలిసేయి. అన్నిటికంటె నవ్వాలో ఏడవాలో తెలీని ఒక అంశం యోగాసనాలు మంచివని. అందులోనూ వృక్షాసనం మోకాళ్ళు గట్టిపడడానికి తోడ్పడుతుంది అని. లేదు, మహానుభావా, అది చేస్తున్నప్పుడే ఈ మోకాలు కలుక్కుమంది. ఆతరవాత నడుస్తుంటే తెలిసింది నొప్పి.

ఆ జాలంలోనే ఇంతకుముందు టైపింగు మితిమీరి చేయి నొప్పి అని elbow brace కొంది. తీరా చూస్తే మోచేయిదగ్గర పట్టు బాగానే ఉంది కానీ కిందిభాగం వదులుగా ఉంది. ఆమాటే reviewలో రాసి, వదిలేసింది. ఇప్పుడు చూస్తే ఆ కంపెనీ జవాబు ఇచ్చేరు.

– వినియోగదారులకి సంతృప్తి కలిగించేలా చూడడం నూటికి నూరు పాళ్ళు మాధ్యేయం. మాది చిన్న ఫామిలీ బిజినెస్. మీసంతృప్తి మాకు ప్రధానం.

ఇదుగో. ఈకింద ఇచ్చిన మూడు విధానాలలో మీకు ఏది ఇష్టమో చెప్పండి అలా చేస్తాం.

1. మీడబ్బు వాపస్ చేసేస్తాం. మీదగ్గరున్న బ్రేస్ తిరిగి పంపనక్కర్లేదు.
2. మరొకటి పంపుతాం. మీకు ఏవిధమైన ఛార్జీ లేదు.
3. మేం అమ్ముతున్న మరొకటి ఏదైనా ఎంచుకున్నా పంపగలం. ఉచితంగానే.

—

ఆజవాబు ఇప్పుడే చూడడం. సరే, “నాచేయి వంకరలు మీరు తీర్చలేరు, knee brace పంపగలరా?”అని రాసింది. తిరుగు టపాలో ఒకటి కాదు, రెండు పంపేరు ఉచితంగానే!!

అదీ జలజాక్షిని అంత ఆశ్చర్యచకితురాలిని చేసింది. ఆ మోకాలిపట్టీ బాగానే పని చేస్తోంది. కొంతవరకూ అడుగులు వేయడం తేలికయింది. అది కొంత ఉపశమనమే కానీ చికిత్స కాదు కదా.

హాల్లోంచి వంటింటికి దగ్గరదారి, వంటింట్లోనో, పక్కగదిలోనో ఉంటే అక్కడినుంచి కదిలేముందు అక్కడ తాను చక్కబెట్టవలసిన కార్యాలు ఏమైనా ఉన్నాయా అని మరోసారి వెనుదిరిగి చూసుకుంటోంది. హాల్లో కూర్చుని కాఫీ తాగేక కప్పు సింకులో చేర్చడానికి రెండు మజిలీలు. పొయ్యిదగ్గర నిలబడితే ఒంటికాలిజపం, ఈరెండోకాలు ఎంతకాలం భరిస్తుందోనన్న సందేహం … … ఈ మార్పులు చిన్నవే అయినా తనజీవనవిధానాన్ని, ఆలోచనావిధానాన్నీ కూడా మార్చేసేయి చప్పుకోదగ్గ స్థాయిలో.

ooo

ఒకరోజు, ఫోనొచ్చింది.

"చాల్రోజులైంది. ఎలా ఉన్నావు? ఈమధ్యనే అనుకున్నాను ఎక్కడున్నావో, ఏంచేస్తున్నావో అని."

"అనుకోకుండా ఊరు మారిపోయేను. షికాగోలో మెయినాఫీసుకి పంపించేరు అసిస్టెంటు మేనేజరుగా."

"అహో, అసిస్టెంటు మేనేజరే! బాగుంది. చెప్పనేలేదు నాకు. సరేలే."

"సారీ, సారీ. మీకు చెప్పాలనుకుంటూనే ఉన్నానండి. ఇక్కడ అంతా కొత్త కదా. మళ్ళీ తుడుంనుంచి దేవతార్చనవరకూ అన్నీ మళ్ళీ మొదట్నుంచీ చూసుకోవాలి కదా. ఆఫీసులోనూ ఊపిరాడకుండా పని."

"అవును మరి. పెద్ద ఉద్యోగం ఊరికే వస్తుందేమిటి. ఫరవాలేదులే. ఇప్పుడు చెప్పేవు కదా. సంతోషం. బాగున్నావు కదా."

"బాగున్నానండి. ఇంతకీ ఎందుకు పిలిచేనంటే ..."

"ఆహా, ఏదో ఉందన్నమాట."

"మరలా అనకండి. అసలే ఇంతకాలం పిలవలేదని బాధగా ఉంది."

"సరే. అనను. విశేషాలు చెప్పు."

"నేనిక్కడ ఉన్న పనులు చాలనట్టు తెలుగు సంఘంలో చేరేను."

"బాగుంది. అభినందనలు."

"థాంక్సండి. ఇంతకీ, అసలుసంగతి, మేం ఉగాదికి ఒక సభ ఏర్పాటు చేస్తున్నాం. మీరు వక్తగా వస్తే బాగుంటుందని. ఇది నాప్రత్యేక విన్నపము అనుకోండి. మీరు సరే అనాలి. మీ ప్రయాణఖర్చులు మేమే భరిస్తాం."

"వద్దులెద్దూ. నాకెక్కడికీ తిరిగే ఓపిక లేదు."

"అదేమిటండి. మిమ్మల్ని మళ్లీ చూడొచ్చని ఎంతో ఆశపడ్డాను. పోనీ నన్ను చూడ్డానికి వస్తున్నాననుకోండి."

"హా హా. అలా అనుకుంటే సరా? మాటాడొద్దూ. అసలు అది కాదు. నాకు మోకాలు వశంలోలేదు. arthritis అనుకుంటున్నా. కొంతకాలం డాక్టర్లచుట్టూ తిరగాలి. అంచేత ఇప్పుడప్పుడే ప్రయాణాలేమీ పెట్టుకోదలుచుకోలేదు."

"అయ్యో అలాగా. మీఇష్టం. ఆలోచించి చెప్పండి. ఉగాది అంటే ఇంకా 4 నెలలుంది కదా."

అక్కడికి మాటలు ముగించి ఫోను పెట్టేస్తుంటే ఈ అమ్మాయి ఎంతటిదిట్ట అయిందీ అనుకోకుండా ఉండలేకపోయింది. అప్పట్లో –

నాలుగేళ్ళయిందేమో కొత్తపెళ్ళికూతురుగా వచ్చింది యామిని ఇండియానించి. కామేశం అసిస్టెంటు ప్రొఫెసరు కాగానే ఇండియా వెళ్ళి పెళ్ళి చేసుకుని తీసుకొచ్చేడు. ఇద్దరూ ఎంతో సరదాగా ఉండేవారు. పుట్టింట అమ్మా నాన్నా ఏడుమల్లెపూలఎత్తు రాకుమారిలా సుకుమారంగా పెంచేరు. కాపురానికొచ్చేక, కామేశం యామినిని సిగపూవు వాడకుండా చూసుకున్నాడు. పువ్వుల్లో పెట్టి అంటే ఏమిటో అతన్ని చూసి నేర్చుకోవాల్సిందే. ఎక్కడికి వెళ్ళాలన్నా అతనే తీసుకెళ్ళడం, ఇంట్లో ఏమి కావాలో చూసుకోడం అతనే, ఎవరితో మాటాడాలన్నా అతనే …

వంటింట్లో ఊరికే తను నిల్చోడమే కానీ పనంతా కామేశమే చేసేవాడు కబుర్లు చెబుతూ. ఆరోజుల్లోనే మరో పని లేక యామిని కథలు రాయడం మొదలు పెట్టింది. అవి కూడా అతనే టైపు చేసి, కవరులో పెట్టి అడ్రెసు రాసి, పోస్టు చేసేవాడు. వీలున్నచోట సాఫ్టుకాపీ పంపేవాడు. వ్యాఖ్యలకి జవాబులు రాసేవాడు.

ఆవిధంగా రోజులు గడుస్తుండగా -

ఆ సుందర సురుచిర స్వప్నం ఒక రోజున టుప్పున పేలిపోయింది గాలిబుడగలా, నిద్రమత్తు ట్రక్ డ్రైవరు నిర్లక్ష్యంమూలాన. క్షణాలమీద యామినిజీవితంలో చిమ్మచీకట్లు కమ్ముకున్నాయి. బుద్ధి పనిచేయడం లేదు. ఓదార్చడానికొచ్చిన స్నేహితులూ, పరిచయస్తులూ, ఇరుగూ పొరుగూ ఏమంటున్నారో వినిపించడంలేదు. రేపేమవుతుందో తెలీడంలేదు.

అలాటిరోజుల్లోనే ఎవరో జలజాక్షిని పిలిచి, "ఒక్కపూట మీరు యామినితో ఉండగలరా?" అని అడిగేరు. వాళ్ళంతా వంతులు వేసుకుని తనకి సాయంగా ఉంటున్నారుట, వాళ్ళవాళ్లు ఇండియానించి వచ్చేవరకూ.

జలజాక్షికి అలా పరిచయమయింది యామిని. కాలక్షేపానికి, మనసు సమాధానపరుచుకోడానికి, ఓ చిన్నకంపెనీలో data entry పనిలో చేరిన యామిని, ఇప్పటికి మేనేజరు అయిందన్నమాట. నలుగురు తెలుగువాళ్ళని పోగేసుకుని, ఓ తెలుగుసంఘం మొదలుపెట్టి, ఊళ్ళో తెలుగువాళ్ళందరికీ తలలో నాలుకైపోయిందంటే ఆశ్చర్యమే మరి!

కాలూ, చెయ్యీ, కన్నూ, చెవీ … ఏదీ తక్కువైనా, అది లేకుండానో, దానికి అనువైన మరోవస్తువు తెచ్చుకునో జరుపుకోడం నేర్చుకుంటాం కానీ బతకడం మానేయం కదా.

ooo

ఆలోచిస్తూ జలజాక్షి కాఫీకప్పు సింకులో పడేయడానికి లేవబోయి, ఆగిపోయింది. మళ్ళీ మోకాలు గుర్తు చేసింది నీకు మోకాలు పనిచేయుట లేదు అని.

దీర్ఘంగా నిట్టూర్చి, “కొత్త విధానాలు నేర్చుకోవాలి మారిన శరీరతత్వానికి అనుగుణంగా. మోకాలు జాగ్రత్త అని నాలుగు చీటీలు రాసి కళ్లముందు బల్లమీద, కుర్చీమీద, రిఫ్రిజరేటరుమీద, మంచానికి ఎదురుగా గోడమీద రాసి పెట్టుకోవాలేమో …” అనుకుంటుంటే చిన్నినవ్వొచ్చింది.

అంతే మరి.

ఇంక ఇప్పుడు తినడానికేముందో చూసుకోవాలి. ఫ్రిజ్ తీసి చూస్తే ఏవో నాలుగు డబ్బాలు కనిపించేయి. ఏది ఏమిటో, ఎప్పుడు చేసిందో తెలీడం లేదు. కానీలే, ఏదీ లేనప్పుడు ఏగడ్డి అయినా రుచిగానే ఉంటుందనుకుంటూ తీసి కంచంలో పెట్టుకుంది.

హ్మ్. చేత్తో తింటే చేయి కడక్కోడానికి వెంటనే లేవాలి. చెంచా తీసుకుంది.

హాల్లో కూర్చుని తింటే, కంచం సింకులోకి చేర్చడానికి మధ్యలో రెండు మజిలీలు. చేతికర్ర మరిచి గబుక్కున లేస్తే, మోకాలు కలుక్కుమంటుంది, కర్ర, కర్ర అని వినిపిస్తూ.

తోచనప్పుడల్లా ఠపీమని లేచి, వీధులు తిరుగుతూ, తన్ను నిలబెట్టేసే పూలూ, కాయలూ ఫొటోలు తీసుకునే ఆశలు మాసిపోయేయి.

అయినా దినము గడిచిపోతూనే ఉంది.

ఒకొకప్పుడు ఏమిటీ నిన్న బుధవారం కదా, ఇవాళ శుక్రవారమా? మధ్యలో గురువారం ఏమయిపోయింది?

నిన్న ఏమిటి చేసేను చెప్మా?

ఇప్పుడే కదా లంచి తిని ప్లేటు సింకుకి చేర్చేను, మళ్లీ ఆకలేస్తోందేమిటి?

ఓహో, వార్తలు, రాత్రిభోజనంవేళ అయిందన్నమాట!

ఎప్పుడూ లేని ఆలోచనలు, ఏనాడూ తలుచుకోని విధానాలు

ఏరోజుకారోజు సమయానుకూలంగా సందర్భాన్నిబట్టి మారిపోతోంది దినచర్య… …

అనుభవాలు మంచి పాఠాలు నేర్పుతాయి. అనుభవం సమయోచితమయితే ఆపాఠం మరింత బలంగా నాటుకుంటుంది.

ooo

(ఆగస్టు 1, 2019)

# 8. ఆద్యంతాలు (కథ)

"ఏమంటావు?" అన్నాడు పొయ్యిమీద పెనంమీద దోసెలు పోస్తున్న తల్లినుద్దేశించి గోపీ కాఫీ చప్పరిస్తూ.

అతడికళ్ళు సెల్ఫోను మీదున్నాయి.

తల్లికళ్ళు పెనమ్మీద దోసెలమీదున్నాయి.

ఎవరి పనులు వారివి. లేదా ఎవరిగొడవ వారిది.

ఆవిడకి కొడుకు మాటలు వినిపించేయి కానీ తిరిగి చూడలేదు.

ఇద్దరూ మొహమొహాలు చూసుకుంటూ మాటాడ్డం ఎప్పుడు మానేసేరో కూడా జ్ఞాపకం రావడం లేదు.

కోపతాపాలు కావు కారణం.

అబ్బాయికి తీరిక తక్కువ.

పనులెక్కువ.

ఆవిడకి పనులు ఎక్కువ లేవు.

తీరిక బోలెడుంది.

దాంతో ఏం చేయాలో తెలీక సతమతమవుతూంటుందావిడ.

ఆవిడకి తెలుసు కొడుక్కి పనులన్నీ సక్రమంగా కళ్లొకటీ, చెయ్యొకటీ, నోరు రెండూ – తినడం, మాటాడడం – ఇన్నీ ఏకకాలంలో చేస్తే కానీ అవవని, రోజు గడవదని.

కొన్ని చేస్తే గానీ బతుకు సాగదు.

అన్యములు చేస్తే గానీ మనసులో తిక్క వదలదు.

ఈపనిలో ఒత్తిడి, ఆ పనిలో చిత్తడి, ఊరట.

వీటన్నిటిమధ్య అమ్మ పులుసులో ముక్కలా.

మరి అలాటప్పుడు మొహాలు చూసుకున్నా ఒకటే, గోడలూ కిటికీలూ చూసినా ఒకటే.

కొడుకుమాటకి రెండు నిముషాలాగి అలవాటయిన సమాధానమే ఇచ్చింది, "నీయిష్టం."

"అలా అంటేనే నాకు చిరాకు. నీకు ఏది బాగుంటుందో చెప్పు. అదే చేదాం. నాయిష్టం ఏమిటి? నీబతుకు నీది. నువ్వు సంతోషంగా ఉండాలనే నాకోరిక," అన్నాడతను.

ఇంగ్లీషు మాటలు అచ్చతెలుగులో. ఆవిడెప్పుడూ తనతల్లిని నీబతుకు నీది అనలేదు. అనగల అవకాశం లేదు.

“నువ్వా …” తల్లి వాక్యం పూర్తి చేసేలోపున ఫోనుపిలుపు మళ్ళీ.

ఠపీమని అందుకున్నాడు బల్లమీద పెట్టిన ఫోను. చెంపకి చేయి చేర్చి మాటల్లో పడిపోయేడు అందుకోసమే ఎదురుచూస్తున్నవాడిలా.

తల్లి తలొంచుకుని తనపనిలో పడిపోయింది.

కొడుకు రెండు దోసెలు తినేసి చాలంటూ లేచిపోయేడు.

“నాకు నీదగ్గర ఉండడమే సంతోషం అని నీకూ తెలుసు కదా. అందుకే కదా వచ్చేను. జీవితంలో చరమదశ పిల్లలదగ్గర గడపాలని ఏ తల్లికీ తండ్రికీ ఉండదు?” – తల్లి ఈమాటలు అనలేదు. అనగలిగితే బాగుండు. కానీ అనడం ఆవిడవల్ల గాదు.

“నువ్వే అంటున్నావు కదా నీసలహాయే ఉచితమని,” అంది, అతికష్టంమీద నోరు పెగుల్చుకుని.

ప్చ్ అంటూ తల్లివేపు చురచుర చూసేడు. “సరే, మళ్ళీ ఆలోచించుకో. రేపు సాయంత్రంలోపున ఆ అర్జీ పంపుకోవాలి. లేకపోతే, నేను చైనా వెళ్లి తిరిగొచ్చేవరకూ ఆగాలి. అక్కడసలు వాటా దొరకడమే కష్టం. నానాగడ్డీ కరిచి నీకు వేగిరం వచ్చేలా చూస్తున్నాను,” అని గబగబా చెప్పదలుచుకున్న నాలుగుమాటలూ చెప్పేసి, చేతిలో కప్పు ఠక్కున బల్లమీద పెట్టేసి లేచిపోయేడు గోపీ.

చివరిసీనులో రకరకాల వాద్యాలలాగ శబ్దాలు. ఆ శబ్దాలన్నీ– కాఫీకప్పు, చెంచాలూ బల్లమీద పడేసిన శబ్దాలు, జోళ్ళు టకటక శబ్దాలు, గరాజి తలుపు తెరుచుకున్న శబ్దం, కారు బయల్దేరిన శబ్దం, గరాజుతలుపు మూసుకున్న శబ్దం … ఆ తరవాత ఎడతెగని నిశ్శబ్దం … ఇందులో కొత్తేమీ లేదు.

ఆవిడ దోసెపిండి, బంగాళదుంపలకూర ఫ్రిజిలో పెట్టేసి, తనగదిలోకి వెళ్లి, మంచంమీద తలగడాలు సర్దుకుని వెనక్కి వాలింది పుస్తకమొకటి హస్తమున ధరించి. పుస్తకంమీద కళ్ళు. మనసు మరెక్కడో విహారం.

ఇందాకా కొడుకు ఫోనులో మాటాడుతున్నధోరణి చూస్తే అదేమంత కొంపలంటుపోయే వ్యవహారంలా అనిపించలేదు. ఎంతోమంది పిల్లల్ని, ముఖ్యంగా అమెరికన్ పిల్లలని, చూసింది “మాఅమ్మతో మాటాడుతున్నాను తరవాత పిలుస్తాను” అనడం.

ఆవిడకుమారుడు మాత్రం అలా ఎప్పుడూ చెప్పడు.

"అమ్మకేముంది, అమ్మెక్కడికి పోతుంది, ఎప్పుడు కావలిస్తే అప్పుడే మాటాడుకోవచ్చు" అని అతడిఅభిప్రాయం. ఆమాటే చాలాసార్లే చెప్పేడు కూడాను ఆవిడకి. "నీకు ఎప్పుడు మాటాడాలనుందో చెప్పు. ఎక్కడున్నా సరే ఆఘమేఘాలమీద వచ్చి వాల్తాను."

ఆకావలసిన సమయం రావడం మాత్రం కనాకష్టం.

అవిడ చిన్నగా నవ్వుకుంది.

"ఆమాత్రం మాట అయినా అనని సుపుత్రులు కూడా ఈలోకంలో ఏమూలో ఉండే ఉంటారు" అంటూ వినిపిస్తుంది అంతరాంతరాల అడుగుపొరల్లోంచి ఓ చిరుస్వరం, ఓ సుందరసురుచిరగళం వీనులవిందు చేస్తూ.

000

గోపీ చిన్నతనంలో తాము ఎంత ఆత్రపడ్డారు వాడికి మంచి చదువు కావాలని, మంచి స్కూల్లో చేర్పించి గొప్ప చదువులు చదివించాలని. తరవాత అన్నీ వరుసక్రమంలో యథావిధిగా జరిగేయి –

ఆ చదువులకోసం సంపాదన,

ఉన్న ఊళ్ళో మంచి స్కూలు లేదని, పట్నానికి మారడం.

దాంతో మరింత ఖర్చు,

తను బాంకులో చేస్తున్న పనితోపాటు, ట్యూషన్లు,

– వీటన్నటిమూలంగా పిల్లవాడిని చూడ్డానికీ వంటకీ మరో మనిషీ, దాంతో అధికంగా మరింత ఖర్చు

– దానికోసం మరో ఉద్యోగం బట్టలకొట్లో ఖాతాలు సరి చూడ్డం – ఇదంతా ఇద్దరూ ఎందుకు చేసేరంటే ఆ కుర్రవాడికి అత్యుత్తమచదువు చెప్పించి, అమెరికాలో అత్యుత్తమ ఉద్యోగం తెప్పించి, అత్యుత్తమసౌకర్యాలు కలిగించడంకోసం.

"నీకోసం ఇంత చేసేం" అని ఎప్పుడూ అన్లేదు. "నిన్నింతవాణ్ణి చెయ్యడానికి మేం ఎంత పాటు పడ్డామో తెలుసా?" అని రొక్కించి అడగలేదు.

అమెరికాలో ఇచ్చిపుచ్చుకోడానికీ మనసంస్కృతిలో ఇచ్చిపుచ్చుకోడానికీ తేడా అదే. అమెరికాలో ఎక్కడిక్కడ లెక్క తేల్చేసుకుంటారు. నువ్వు నాకు సాయం చేస్తే నేను నీకు మరేదో ఇచ్చి తత్‌క్షణమే అప్పు తీర్చేసుకునే పద్దతి. అదొక పద్ధతి.

మనకీ అప్పులు కొన్ని తరాలకి, సమాజానికీ కూడా పాకిపోతాయి. ఎప్పుడు ఎవరికి సాయం చేస్తామో, ఎవరు మనకి సాయం చేస్తారో చెప్పలేం. తల్లీకొడుకు ఋణం కూడా అంతే.

000

రెండో రోజూ, మూడో రోజూ, ఆరో రోజూ, తొమ్మిదో రోజూ కూడా ఆ ఇద్దరిమధ్యా అదే సంభాషణ సాగినతరవాత, తల్లి, "ఇక్కడ బాగానే ఉంది కదా. ఎందుకిప్పుడు …" అంటూ సగంలో వాక్యం అసంపూర్ణంగా వదిలేసింది.

"ఏం బాగు. నేనేమో నాపన్లమీద తిరుగుతుంటాను. నీకు ఏ అవసరం వచ్చినా చూడ్డానికి, హఠాత్తుగా ప్రాణంమీదికి వస్తే ఆదుకోడానికి ఎవరో ఒకరు ఉండాలి కదా. నువ్వే అంటున్నావు ఇక్కడ మనిషిమొహం కనిపించదనీ, అడవిలో ఉన్నట్టుందనీ. అక్కడయితే నీకు ఏదైనా అయితే, వెంటనే ఆదుకునే సంరక్షకులుంటారు. కనీసం నన్ను పిలిచి చెప్పడానికైనా ఒకరు ఉంటారు. పైగా అక్కడ నీకేం తక్కువ కాదు కదా. నీ వంటా నీ పొయ్యి అన్నీ నీకు ప్రత్యేకంగా ఉంటాయి. సాటి మనుషులుంటారు రకరకాల వ్యాపకాలూ, నీకెలా సమయం గడుపుకోవాలంటే అలా గడుపుకోవచ్చు."

తల్లి సందేహిస్తూనే నెమ్మదిగా అంది, "ఏమోమరి. నేనిక్కడికి వచ్చింది నీదగ్గరుండడానికి.  మనవాళ్లంటూ ఉన్నప్పుడు అలా దిక్కు మాలినవాళ్లలా ఏదో సత్రంలో ఉండడమేమిటి?"

"అది సత్రం కాదు. అద్దెఇల్లు. అక్కడేమీ ఉచితం కాదు. నీకు ఇక్కడ మనింట్లో ఏఏ సౌకర్యాలు ఉన్నాయో అవన్నీ అక్కడా ఉంటాయి. అధికంగా మనుషులు కనిపిస్తూంటారు. నువ్వే అన్నావు కదా ఎక్కడా మనిషిమొహం కనిపించదని. మరి అక్కడ కనిపిస్తారు. నీకు కావలసినవారితో కావలిసిన కాలక్షేపాలు ఏర్పాటు చేసుకోవచ్చు. పాటలు, డాన్సులూ, బ్రిడ్జి …" అంటూ ఆగిపోయేడు గోపీ. అవన్నీ అమ్మకి అక్కర్లేదని గుర్తొచ్చింది.

ఆవిడపెదవులమీద ఛాయామాత్రంగా మందహాసం క్షణకాలం వెలిగి మాయమయింది. కొడుకుమీద రవంత జాలి కూడా కలిగింది.

"దానికేముందిలే. నాకాలక్షేపాలు నేనే చూసుకుంటాను. అదసలు సమస్యే కాదు."

000

ఆవిడ అసలు మొదట దేశం వదలడానికి ఇష్టపడలేదు. అప్పుడు మరోరకం వాదన అయింది కొడుకుతో.

"నాబాధల్లా నువ్విక్కడ ఒక్కదానివీ ఉంటే, నాకక్కడ నువ్వెలా ఉన్నావో అని మనసు పీకుతూనే ఉంటుంది. అక్కడయితే, నిన్ను చూసేవాళ్ళున్నారు కదా అని ధీమా ఉంటుంది కదా నాకు."

“ఇక్కడా ఉన్నారు నాకు చూసేవాళ్ళు. పెద్దక్కయ్య నేనంటే ప్రాణం పెడుతుంది. సిరి, అరవిందా, సంద్రాలు కూడా …”

“హాహ్, వాళ్లల్లో ఎవరు నువ్వు పిలవగానే పరిగెట్టుకొచ్చేసి, ఏ ఆస్పత్రికో తీసికెళ్లగలవాళ్ళు?”

“అలా అంటావేమిటి? సిరీ, అరవిందా, పక్కింటి రామానుజంగారూ – ఇంకా చాలామందే ఉన్నారు కార్లు ఉన్నవాళ్లు.”

“కారు లేనివాళ్ళనలేదు నేను. ఎవరు అలా నిల్చున్నపాటున రా అంటే వచ్చేయగలవాళ్ళు అంటున్నా.”

తల్లి మాటాడలేదు. అదీ నిజమే. ఎవర్ని చూసినా రోజుకి 36 గంటలుంటే బాగుండుననేవాళ్ళే.

ఏం చెప్పగలదావిడ? నిజమే, ఎదుట ఉన్నప్పుడు ఎప్పుడేం కావలసినా సందేహించకుండా పిలు అంటారు కానీ తీరా పిలిస్తే, ఒక్కరికీ తీరికుండదు. ఏం చేస్తాం, ఈనాటి జీవనసరళి అదీ.

ఆవిడ సరేననగానే ఏనుగెక్కినంత సంతోషిచేడతను.

000

ఆఖరికి మనసు మార్చుకుంది ఆవిడ ఎందుకూ అంటే

– తనవంశంలో ఎవరూ 80 దాటి బతకలేదు. అంటే మరో మూడేళ్ళన్నమా ఆట. అంటే మూడేళ్ళూ  బతుకుతాననేం లేదు కదా. ఆ చివరిఘడియల్లో ఊరివాళ్లెవరో ఆదుకోవలసివస్తుంది. ఊళ్ళోవాళ్ళంతా వాడినే అంటారు ఉన్న ఒక్క కొడుకూ పట్టించుకోలేదని. తన తదనంతరం, కనీసం మిగిలిన ఆస్తి ఈ డబ్బా డవాలీ – లక్షలూ కోట్లూ కాకపోయినా – నాలుగు పరకలే అనుకో తీసుకోడానికో పారేయడానికో ఆ సుపుత్రుడే రావలసి వస్తుంది. అంచేత వాడిదగ్గరికి వెళ్ళి ఉండడమే సుఖం. అదీ నిర్ణయం.

000

ఈలోపున గోపీజీవితంలో కొన్ని మార్పులొచ్చేయి. అందులో ప్రధానం ఒకఅమ్మాయితో జత కలపడం. ఆసంగతి తల్లికి చెప్పలేదు.

ఆవిడ అమెరికాలో దిగి వారం రోజులయింది. అప్పుడు చెప్పేడు ఆవిడకి వేరే వసతిగృహంలో ఏర్పాటు చేస్తున్నట్టు.

ఆవిడమనసు చివుక్కుమంది. అయినవాళ్ళనీ, అచ్చొచ్చిన ఇంటినీ వదలుకు అంతదూరం పదివేల మైళ్లు  రావడం కొడుకుతో చివరిరోజులు గడపాలని కానీ దూరంగా మరో ఇంట్లో ముక్కూ మొహం తెలీనివారిమధ్య కడతేరాలనా?

"అట్టే దూరం లేదమ్మా. యాభైమైళ్లంటే నీకు ఏదో దూరంలా అనిపిస్తుంది కానీ ఇక్కడ పొరుగింటికిందే లెఖ్ఖ. రోజూ ఉద్యోగానికి వందమైళ్ళు ప్రయాణం చేసేవాళ్లు  కోకొల్లలు," అంటూ నచ్చచెప్పడానికి ప్రయత్నించేడు గోపీ.

"పోనీ వచ్చి చూడు అక్కడ వసతులూ అవీ. నీకు నచ్చితే ఉండు లేకపోతే మరేదో మార్గం చూదాం," అని కూడా హామీ ఇచ్చేడు.

ఆవిడ తలూపింది.

000

శుక్రవారం మధ్యాహ్నం కొడుకు తల్లిని తీసుకెళ్ళేడు ఆ వయసు మళ్లినవారి నివాసానికి.  మేనేజరు వాళ్ళిద్దరికీ అక్కడున్న వసతులన్నీ చూపించింది. మోడల్ వాటా చూపించింది.  కొత్తగా వేసిన రంగులతో గోడలు మెరిసిపడుతున్నాయి. వంటింట్లో అల్మారాలన్నీ అందుకోడానికి వీలుగా, విశాలంగా ఉన్నాయి. ఆ వాటాలోనే లాండ్రీ సదుపాయాలున్నాయి. హాలునానుకుని చిన్న వరండా ఉంది. ఆ పక్కనే swimming pool ఉంది. ఇద్దరు స్త్రీలు ఆ పూలుపక్కన పుస్తకాలు పట్టుక్కూర్చున్నారు. షూటింగుకి సిద్ధంగా ఉన్న సినిమాసెట్ లా ఉంది.

మేనేజరు పూల్ రూల్సు వివరించబోతే, గోపీ అడ్డుపడి, ధన్యవాదాలు చెప్పి, ఆ వివరాలు తరవాత మాటాడుకుందాం అన్నాడు.

అమ్మకి నచ్చలేదు అనుకున్నాడు మనసులోనే. ఆవిడ విడిగా చెప్పనవసరం లేకపోయింది.

దారిపొడుగునా ఎవరి ఆలోచనల్లో వాళ్లు.

– నచ్చలేదని చెప్పనా, నచ్చింది, అక్కడుంటాలే అని చెప్పనా అన్నది ఆవిడసమస్య

– నచ్చలేదంటే ఏమిటి చెయ్యడం? నా ఇంట్లో నువ్వుండడానికి వీలవదమ్మా, నా girl friend లీసా ఒప్పుకోదు అని ఎలా చెప్పడం? అవిడకి చెప్పకపోతే లీసాకి ఎలా వివరించడం?-ఇది అతడిసమస్య.

000

మూడోరోజు తల్లి ఆ వృద్ధాశ్రమానికి వెళ్లడానికి నిశ్చయించుకుని కొడుక్కి చెప్పింది, "అక్కడ బాగానే ఉండేటట్టే అనిపిస్తోంది. నీక్కూడా మనశ్శాంతి కదా. వారంరోజుల్లో మళ్ళీ చైనాప్రయాణం అంటున్నావు. ఈలోపున నేనక్కడికి మారిపోగలనేమో చూడు."

ఆమాట వినగానే కొడుకుమొహంలో వెలిగిన మతాబాలు చూసి, తృప్తిగా నిట్టూర్చిందావిడ.

000

కొత్తింట్లో ఆవిడని దింపి, వారం వారం తప్పకుండా వచ్చి చూసి పోతుంటానని పన్నెండుమార్లు నొక్కి నొక్కి చెప్పి, గోపీ వెళ్లిపోయేడు.

కొడుకు వెళ్లినదిశ చాలాసేపు చూస్తూ కూర్చుండిపోయిందావిడ.

"మీఅబ్బాయా?"

ఉలిక్కిపడి చూసిందటు. అవునన్నట్టు తలూపింది.

"డాలీ."

ఆవిడకి అర్థం కాలేదు. అయోమయంగా చూసింది. ఆ రెండో ఆవిడ నవ్వి, "నాపేరు డాలీ. మీపేరు?"

"కమల," అంది గోపీతల్లి.

సరేనన్నట్టు తలూపి వెళ్ళిపోయింది డాలీ.

అప్పుడప్పుడు కామన్ హాల్లో కనిపించేది. ఒకరోజు బ్రిడ్జి ఆడదాం వస్తావా అనడిగింది.

తానే నేర్పుతానంది.

మరో ఇద్దర్ని పిలిచింది.

కమలకి ఆటయితే తేలిగ్గానే పట్టుబడింది కానీ ఆ ముగ్గురితో కలవడమే కుదరలేదు. ఆ ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ నవ్వుతుంటే తనపని రేగుచెట్టుకింద గుడ్డివాడివతు అయింది.  ఆవిడ ఇంటరువరకూ చదివింది ఆపైన తెలుగు కథలు చదవడం మొదలు పెట్టేక ఆవిడఇంగ్లీషు మెరుగు పడిందనే అనుకుంది. అయినా వీళ్ళ ఇంగ్లీషు మాత్రం అర్థం కావడం లేదు

డాలీ ఒకట్రెండుసార్లు ఆ హాస్యాలు వివరించడానికి ప్రయత్నించింది కానీ ఆవిడకి హాస్యం కనిపించలేదు. దాంతో బ్రిడ్జి సరదా తీరిపోయింది.

000

నెలరోజులయింది. గోపీ చైనానించి తిరిగొచ్చేడు. ఆ ఆదివారం తల్లిని చూడడానికి వచ్చేడు. లీసాని కూడా తీసుకొచ్చి పరిచయం చేసేడు.

ఇదన్నమాట కథ అని ఆవిడకి అప్పుడు అర్థమయింది.

"నేను మనఊరికి వెళ్లిపోతాను."

మెరుపులేని ఉరుము!!!

గోపీకి రెండు నిముషాలు పట్టింది తేరుకోడానికి.

“ఆఁ? ఏంటన్నావూ?” అడిగేడు, సరిగ్గా విన్నాడో లేదో తేల్చుకోడానికి.

“నాకిక్కడ ఊపిరాడ్డం లేదు. దేశం విశాలం, వీధులు విశాలం. ఇళ్లు విశాలం. నాకు మాత్రం ఊపిరాడ్డం లేదు. ఇరుకు. నేనిక్కడ ఉండలేను.”

“అదేమిటి? నాదగ్గర ఉండాలని కదా వచ్చేవు. ఇప్పుడు అక్కడికి మళ్ళీ ఎందుకు? మనం ఇవన్నీ మాటాడుకున్నాం కదా. నీకక్కడ అవసరసమయంలో ఆదుకునేవాళ్లుండరని.”

“అప్పుడలా అనుకున్నాను. కానీ ఇక్కడ చూసేక, అక్కడే నయం అనిపిస్తోంది.”

“ఇంకో నాలుగు నెలలు చూడకూడదా? అలవాటవడానికి కొంత కాలం పడుతుంది.”

“లేదులే. అవదు. మొలకయితే ఒకచోటినించి పీకి మరోచోట పాతితే బతుకుతుంది. మహావృక్షం అలా మరోచోట నాటితే బతకదు. అక్కడ పుట్టేను. అక్కడే పోవాలి.”

“అవేం మాటలమ్మా? నేను మాత్రం ఇక్కడ పుట్టేనేమిటి? నీవయసువాళ్ళు ఎంతమంది ఇక్కడ లేరు—యాజలుగారూ, వనజాక్షిగారూ, …”

“ఉన్నారు. ఉండలేక వెళ్లిపోయినవాళ్లు మాత్రం లేరా? వీరభద్రస్వామిగారూ, ఆషా అయ్యరూ …  నువ్వు ఇక్కడ ఇమిడిపోయేవంటే నిన్ను మేం అలా పెంచేం. నాపెంపకం తీరు వేరు. నేను అమెరికా రావాలనుకుంటూ నా జీవనసరళి దిద్దుకోలేదు.”

గోపీకి చిరాకేసింది, “కానీయ్. రెండురోజులు పోయేక మళ్లీ వస్తాను. అప్పటికి నువ్వు ఏమూడ్ లో ఉంటావో,” అన్నాడు సగం హాస్యంగానూ సగం సీరియస్గానూ.

కమల కూడా నవ్వింది. “రెండు రోజులూ, పన్నెండు రోజులూ అయేక కూడా ఇదే అంటాను. ఇక్కడికి రాకముందు నాకు తెలీదు. ఇప్పుడు రెండువంకలా చూసేను కనక ఇదే నానిశ్చయం.”

గోపీ తలొంచుకుని రెండు నిముషాలూరుకుని, “అక్కడ ఏం చేస్తావు ఏమయినా అయితే?” అన్నాడు నెమ్మదిగా.

“తెలీదు. అప్పటికి ఎలా తోస్తే అదే చేస్తాను. ఫరవాలేదు గోపీ, మనపద్ధతులు వేరు. నీకు అన్నీ ప్లాను ప్రకారం చేసుకోడం అలవాటు. నాకు ఎప్పటికి ఎలా జరిగితే అలా చేసుకోడం అలవాటు,” అంది కమల  శాంతంగా.

ఆవిడమొహంలో ప్రశాంతత చూసి, “అమ్మకేం ఫరవాలేదు” ఎక్కడున్నా అనుకున్నాడు తృప్తిగా.

000

((ముఖ్యగమనిక. ఇది వృద్ధాశ్రమాలమీద వ్యాఖ్యానం కాదు. ఈకథ కేవలం వ్యక్తినిర్ణయాలగురించి మాత్రమే. ప్రతివారు తమకి ఇష్టమైన, అనువైనవిధంగా జీవించాలనే కదా కోరుకుంటారు. ఈనాటి నీతి అదే. ఆ ఆలోచనాసరళిలో ఎవరు ఎలా జీవిస్తారు అన్నది మరొకరు నిర్ణయించడం న్యాయం కాదు. వారినే ఎంచుకోనివ్వాలి అని నాఅభిప్రాయం. అదే ప్రతిపాదించడానికి ప్రయత్నించానిక్కడ.))

000

(ఆగస్ట్ 23, 2018)

# 9. తెలివితక్కువతనం నీజన్మహక్కు (గల్పిక)

సకల చరాచరప్రపంచములో అత్యంత తెలివితేటలు గలవాడు మానవుడు అని మేధావులు చెప్పివున్నారు. మనం అందరమూ అదే నమ్ముతూ వస్తున్నాము కొందరిని మనం అప్పుడప్పుడు తెలివితక్కువవాడు, మూర్ఖుడు అని తెగనాడినా, మనిషి అయిన ప్రతివాడికీ తెలివితేటలు ఉంటాయనే మనందరి నమ్మకము.

అందువల్ల జరిగన నష్టం ఏమిటంటే నువ్వో నీ మేనల్లుడో, పొరుగువాడో తెలివితక్కువ పని చేసినప్పుడు, "హ్మ్, అంత తెలివితక్కువగా ఎలా ప్రవర్తిస్తాడు," అంటూ విసుక్కోడం జరుగుతుంది. ఇది అన్యాయమని నా అభిప్రాయము.

మనం ఏమి చేసినా ఏమి మాటాడినా ఈ కొలమానం, తెలివైనపని లేదా తెలివితక్కువపని, అన్నది సాపేక్షికమే కదా.

కనకపుసింహాసనమున శునకముఁ గూర్చుండబెట్టిన .. అంటే మనిషిని కుక్కతో పోల్చడం చేస్తాం. కుక్క వెనకటిబుద్ధి మానదు. అందులో తప్పేముందో నాకర్థం కాదు. ఎవరికి ఏమి ఇష్టమయితే అదే చేస్తారు. కనకపుసింహాసనం నీకు గొప్ప కావచ్చు. కుక్కకి అది గొప్పగా అనిపించకపోవడం కుక్క తప్పు కాదు. నీ కొలమానాలు కుక్కకి అంటగట్టడం తెలివతక్కువ నన్నడిగితే. బురదగంటలో చల్లగా, సుతిమెత్తగా ఉండే బురద కంటే ఈ బంగారంకుర్చీ ఏమి సుఖం అని కుక్క అనుకోవచ్చు. కార్లలో తోలుసీటులలాగే. నీకు తెలుసో తెలిదో ఆ తోలు సీట్లు ధనవంతులకి ఘనమే కానీ అవి శీతాకాలంలో చల్లగానూ, ఎండకాలంలో చురుక్కుమని కాల్తూనూ ఉంటాయి. వాటిమీద కూర్చోడం నాకైతే సుఖమనిపించలేదు. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే కుక్కకి కనకపుసింహాసనం సుఖదాయకం కాదు. నాకు ఇష్టమైన చోట నేను కూర్చుంటాను అంటుంది, మీకు కుక్కభాష తెలిసి, ఆభాషలో అడగగలిగితే. మరి మనం కుక్క హక్కులను కూడా గౌరవించాలి కదా.

కుక్కలు, పిల్లులు, ఏనుగులు, గుర్రాలు … అన్ని జంతువులకీ ప్రేమలూ, కోపాలూ, ఇష్టాయిష్టాలూ ఉన్నట్టు దాఖలాలన్నాయి. వాటికి విశ్వాసం ఉంది. ఆత్మగౌరవం కూడా ఉన్నట్టే కనిపిస్తోంది. వాటిని అట్టే రెచ్చగొడితే, మనమీదకి ఉరికి మనని కొరికిపారేస్తాయి కనక.

పోతే, వాటికి లేనిది ఏమిటి అంటే తెలివితక్కువతనమే. ఆ కుక్క, పిల్లి, ఏనుగు చూడు, ఎంత తెలివితక్కువపని చేసిందో చూసేవా అనడానికి లేదు. అవి చాలా మప్పితంగా ఉంటాయి. వాటినియమం ఏమిటంటే, "నువ్వు నాజోలికి రాకు, నేను నీజోలికి రాను," అని. చూసేరా, అది తెలివితక్కువతనం కాదు కదా.

మరి మనమో, అదుగో అల్లప్పుడెప్పుడో నన్ను తిట్టేవు అంటూ ఆజన్మాంతం సాధించిపోస్తాం. మీరు దాన్ని కక్ష అనొచ్చు కానీ నేను తెలివితక్కువతనమే అంటాను.

నలభైఏళ్ళక్రితంమాట ఇది. ఓ మధ్యాహ్నం ఎవరో తలుపు దబదబా బాదడం వినిపించింది.

ఏమిటా అని తెరిచి చూస్తే పక్కవాటాలో కొత్తగా దిగినావిడ. ఆసియాఖండంనుంచే అని ఆవిడముఖం చెప్తోంది. ఇంగ్లీషు రాదు కాబోలు వణికిపోతూ ఎదుటి బిల్డింగు కప్పువేపు చూపించింది. ఆ కప్పుమీద ఓ చిమ్నీలోంచి పొగ వస్తోంది. కొంపలంటుకుపోతున్నాయని ఆమె అనుకుందని అర్థమయింది. అది చిమ్నీ అనీ, చలికాలంలో ఇంట్లో వెచ్చగా ఉండడానికి హీటరు వేసుకున్నప్పుడు, బయట చలి మరీ ఎక్కువుంటే అలా పొగ కనిపిస్తుందనీ చేతులూపుతూ అనేకభంగిమలలో కరవిన్యాసాలతో ఆవిడకి బోధపరిచేను. మరి నాకు ఆవిడభాష రాదు. ఆవిడకి నాభాష రాదు. మరీ అంత అమాయకత్వమేమిటి అని రవంత జాలి పడ్డాను కూడా అనుకుంటాను అప్పట్లో.

మళ్ళీ నిన్న నేను సరిగ్గా ఇంచుమించు అలాటి పరిస్థితిలోనే పడ్డాను. అంటే 40 ఏళ్ళతరవాత కనక, ఇది ఖచ్చితంగా తెలివితక్కువతనమే.

ఏం జరిగిందంటే, నేనున్న అంతస్తులో చెత్త పారేయడానికి గొట్టం లాండ్రీరూంలో ఉంది. రోజూలాగే నిన్న కూడా నేను చెత్తసంచీ పుచ్చుకు లాండ్రీ తలుపు తీసి నివ్వెరపోయేను. గదంతా పొగ ఉమ్మలు చుట్టుకుపోతూ దర్శనమిచ్చింది. ఒకమిషనులోంచి రైలింజనులోంచి వచ్చినట్టు గుప్పుగుప్పుమంటూ పొగ వచ్చేస్తోంది. ఏక్షణంలోనైనా ఆ మిషను ఫెళ్ళున విరిగి, మంటలు చెలరేగిపోతాయని బెదిరిపోయి, గబగబ వెళ్ళి మేనేజరుతలుపు తట్టేను.

"ఏంటి నాతలుపు బద్దలు కొట్టేస్తున్నావు" అంటూ తలుపు తెరిచిందావిడ.

అక్కడ … పొగ … లాండ్రీరూంలో … ఆ మూడు ముక్కలూ చెప్పడానికి నాకు ఒకటిన్నర నిముషం పట్టింది.

“పోగా?” అంటూ నిదానంగా ఆవిడ నావేపు అనుమానంగా చూసి, సరే చూస్తాలే అంటూ అటు వెళ్ళింది.

నేను నావాటాలోకి వెళ్లేనే కానీ ఊరుకోలేకపోయేను.

అక్కడికి వెళ్ళి చూస్తే, మేనేజరు, కిటికీతలుపు తీసి, నెమ్మదిగా వాషరులో బట్టలు బయటికి తీసి పక్కన పెడుతూంది.

నన్ను చూసి, వాషరుకి ఉన్న రబ్బరుగొట్టం కాలి పోగ అంది.

ఆ బట్టలు మామూలు బట్టలు కావు. Victorian mansionలో వేసుకునే దట్టమైన పరదాలతో పాటు కుక్కపిల్లలు పడుకునే తట్ట కూడా మిషను ఉక్కిరిబిక్కిరి అయేలా కుక్కేసేరు ఎవరో. అంచేత మెషీను ఉక్కిరిబిక్కిరి అయి రబ్బరుగొట్టం అంటుకుంది.

ఇక్కడ నేను అంతగా భయపడడం నా తెలివితక్కువతనమేనని మామేనేజరు అనుకుని ఉండవచ్చు. మీరందరూ కూడా అనుకుంటున్నారేమో ఇంతకాలం ఈదేశంలో ఉండి ఆమాత్రం తెలీదా అని.

నేను మాత్రం ఆ వాషరులో కిటికీతెరలూ, కుక్కపిల్లలపక్కలూ కుక్కినవారి తెలివితక్కువతనమే అని అనుకుంటున్నాను.

నేనిక్కడున్న నాలుగేళ్ళలో ఎవరూ కొత్తగా రాలేదు. అంచేత ఆవ్యక్తి చాలాకాలంగా ఇక్కడ ఉన్నారనీ, వారికి వాషరు బలాబలాలు తెలిసే ఉంటాయనీ అనుకోడం సహజం కదా. అవన్నీ వాషరులో ఎలా పడేశారు అంటే తెలివితక్కవతనమే మరి.

ఇలాటి తెలివితక్కువ పనులు మనుషులే చేస్తారు కానీ కుక్కలూ, పిల్లులూ, ఏనుగులూ, గుర్రాలూ చేయడం ఎవరైనా చూసేరా చెప్పండి. లేదు. నేను చూడలేదు.

అందుకే అంటున్నాను జంతువులకున్న వసతులమేరకు జంతువులు ఏదో ఒకరకమైన నియమంతోనూ సంయమనంతోనూ ప్రవర్తిస్తాయి.

మరో చిన్న ఉదాహరణ కూడా ఇచ్చి ముగించేస్తాను. ఇది కూడా 40 ఏళ్లక్రితం మాటే. పోనీ 35 అనుకుందాం. ఏమైనా పాతకాలం కథే. ఒకరోజు వేలు తెగిందని ఆస్పత్రికి వెళ్ళేను.

అక్కడ నర్సు నాచేతికి కావలసినసేవ చేస్తూ, “ఎలా తెగింది? incineratorలో చెయ్యి పెట్టేవా?” అనడిగింది. అదేం ప్రశ్న అనిపించింది నాకు. ఎవరైనా, ఎంత తెలివితక్కువవారైతే మాత్రం incineratorలో చెయ్యి పెడతారా?

నేను కనుబొమ్మలు ముడిచి, “లేదు. incineratorలో ఎందుకు చెయ్యి పెడతానూ,” అని దీర్ఘాలు తీసి, మెల్లిగా చెప్పేను, “lawnmowerలో పెట్టేను. జాగర్తగా ఆ బ్లేడ్స్ మధ్య ఇరుక్కున్న గడ్డి లాగబోతుంటే వేలుకి బ్లేడు తగిలి గీసుకుపోయింది.”

దీనికి టీక అవుసరంలేదు. తెలివితక్కువతనం మాత్రం మానవుల జన్మహక్కు అని మాత్రం నొక్కి వక్కాణించగలను.

000

(జనవరి 29, 2019)

## 10. కారుతాళం దొరికింది (గల్పిక)

ఇంతకుముందు ఇంటితాళాల గురించి రాసేను. ఇది కారుతాళం గురించి. తాళం అని ఏకవచనం ఎందుకంటే అది ఒక్కటీ విడిగా ఉంచుతాను. కారులో వెళ్ళినప్పుడు తప్ప దాని అవుసరం లేదు కదా. అస్తమానం మోసుకుతిరగడం ఎందుకని. వీలయినంత తేలిక చేసుకోడంలో నాతరవాతే ఎవరైనా.

ఇంతకీ తాళంమాట. మాయింటికి మైలుదూరంలో ఉన్న కూరలబజారుకి వెళ్ళేను హఠాత్తుగా అరటిపళ్ళు తినాలనిపించి. ఒక్కటే కనక గబగబ కొనేసుకుని బయటికొచ్చి చూస్తే కారుతాళం కనిపించలేదు చేతిసంచీలో.

కొంచం గాభరా పడి నేను ఎక్కడ బయల్దేరి ఏఏ షెల్ఫుల సందులలో తిరిగేనో, ఏ చెకర్ దగ్గర చెక్ చేసుకున్నానో ఆ దారులన్నీ అదే వరసలో తిరిగేను.

తాళం కనిపించలేదు.

మేనేజరుని అడిగేను ఎవరైనా కారుతాళం ఒకటి గత అరగంటలోనూ మీకు అప్పచెప్పేరా అని.

లేదంది.

మళ్ళీ కారుదగ్గరికి వెళ్ళి కారుకింద తొంగి చూసేను, ఒకవేళ కారుదిగి సంచీలో వేసుకుంటున్నప్పుడు కింద పడిపోయిందేమోనని.

లేదు. కనిపించలేదు.

మళ్ళీ స్టోరులోకి వెళ్లి నేను నడిచిన దారులన్నీ మరోచుట్టు నడిచి, చెకర్ దగ్గర కింద మళ్లీ వెతికి, లేదని నిశ్చయించుకుని, కారుదగ్గరకి చేరుకుని దిక్కులు చూస్తూ నిలుచున్నాను కొంచెంసేపు.

తరవాత, నెమ్మదిగా కారుని ప్రేమమీరా బుజ్జగించి, ఇప్పుడే వస్తానని చెప్పి, ఆడపిల్లని అత్తారింటికి అప్పగింతలు పెట్టినినాటి విచారంతో, అడుగులో అడుగేసుకుంటూ ఇల్లు చేరుకున్నాను.

దారిపొడుగునా మరో బాధ ఆకారు తాలూకు మారుతాళం దొరుకుతుందా, ఎక్కడ పెట్టేనో జ్ఞాపకం వస్తుంందా, వెనకప్పుడో చేసిన పూజలు ఫలించునా … అంటూ ఓమూల ఓ చిన్నిగొంతు నసుగుడు. ష్, ఊరుకో, అన్నీ అవే బాగుంటాయని స్వగతంలో కసురుకుని, ఇల్లు చేరేను.

కారుతాళం పోయినా, ఇంటితాళాలు భద్రంగా ఉన్నందుకు, అలా ఉండడానికి కారణం అవన్నీ ఒకే గుత్తిలో కాక వేరుగా ఉంచగల తెలివి నాకు ఉన్నందుకూ మరోసారి నన్ను అభినందించుకుని, , ఇంట్లోకెళ్ళి, గ్లాసెడు మంచినీళ్లు తాగి, గదిమధ్యలో నిలబడి ఇల్లంతా కలియచూసేను. నాకున్న రెండుగదులూ అలా చూడడానికి అవకాశం ఉండడం నాకు శుభసూచకంగా కనిపించింది. రెండు క్షణాలు ఆలోచించగా, నాకు మూడు చోట్లు తోచేయి. అట్టేసేపు పట్టలేదు. మూడోచోటు చూడవలసిన అవుసరమే రాలేదు. రెండో చోట కనిపించింది తాళం. ఒకొకప్పుడంతే, అన్నీ లెక్కప్రకారం జరిగిపోతాయి. “నువ్వుట్టినే ఆరాటపడిపోతావు, కానీ అన్నీ సవ్యంగా జరిగిపోతాయి,” అని అశరీరవాణి బుజ్జగిస్తుంది

సరే, ఆ మారుతాళం తీసుకుని మళ్ళీ బజారుకి బయల్దేరేను.

వాతావరుణుడు వాన పడుతుందని హెచ్చరించేడు కానీ చిన్న చిన్న తుప్పర్లు పడుతున్నాయని తెలీనంత సుతారంగా పడుతున్నాయి.

మళ్లీ దారిపొడుగునా ఆలోచనలే. కారుతాళం పోయిందని నేనేడుస్తుంటే, అది దొరికినవాడు, “ఆహా, ఈరోజు సుదినము. అయాచితంగా ఇంతమంచి కారు ప్రసాదించిన భగవంతుడు ఎంత మంచివాడు” అంటూ ఆనందనృత్యం చేయొచ్చు.

నేను మళ్ళీ కాళ్లీడ్చుకుంటూ ఇంంటికొచ్చి ఇన్సూరెన్సు కంపెనీని పిలవాలి.

“కారు ఎలా పోయింది?”

“తాళం పోవడంమూలాన.”

“తాళం ఎలా పోయింది?”

“తెలీదు.”

“అంటే?”

“అంటే, నేను కారు దిగి, తాళం నాచేతిసంచీలో వేసుకున్నాను.”

“అయితే సంచీలో ఉండాలి కదా,”

“లేదు. సంచీలో కాక మరెక్కడో పడిపోయింది.”

000

ఎందుకులెండి, ఆ సంతంతా రాయడం. సవాలక్ష ప్రశ్నలు.

రెండో వరసలో పోలీసురిపోర్టివ్వాలి. అక్కడ కూడ ఇలాటి ప్రశ్నలు మరింత తీవ్రంగా ఉంటాయి. సన్నగా నా అజాగ్రత్తని మందలించడం కూడా జరగొచ్చు.

000

అదేంటో ఈ తిక్క ఆలోచనలు చూస్తే మనకి మనమే ఎంత పిరికిమందు పోసుకుంటామో అనిపించదూ?

అని నామీద గట్టిగా విసుక్కుని, గమ్యం చేరుకుని, అల్లంతదూరంలోంచే నాకారుకోసం చూసేను. నాకారులాటిదే అక్కడ ఉంది కానీ అది నాదేనా అని అనుమానం.

హమ్మయ్య, పోయినతాళం మరొకరిచేతిలో పడలేదన్నమాట. కారుతాళం దొరికినవాడు, బజారుపని చూసుకుని ఈకారు తీసుకుపోదాం అనుకోడు కదా  దోచుకుపోదలుచుకున్నవారు చేతికి జిక్కింది తీసుకుపోతారు కానీ తీరిగ్గా మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చోరు. మిగతా పనులు చూసుకుని, ఈకారు తీసుకుపోవచ్చులే అనుకుంటూ తచ్చాడాడంటే ఆ మనిషి చోరవృత్తికి అనర్హుడే.

పట్టరానంత ఆనందంతో, చిన్న వణుకుతో కారు తలుపు తెరిచి, సీటులో కూర్చుంటే నాలుగుక్షణాలు చక్రవర్తి మహాసామ్రాజ్యపు  సింహాసనం అధిష్ఠించినప్పుడు ఎలాటి ఆనందం అనుభవిస్తాడో తెలిసింది. ఆ తరవాత నెమ్మదిగా కారు వెనక్కి తీసి, మనసొప్పక మరోసారి ఆ కారున్న స్థలంవేపు చూసేను.

ఆహో, ఒహో, ఏమి చెప్పను నా కన్నులు నన్ను మోసగిస్తున్నాయో, కలయో, మాయయో అనుకుంటూ మూడు కార్లకి అడ్డంగా, అడ్డదిడ్డంగా నాకారుని అలాగే వదిలేసి, కారు దిగి, వెళ్ళి ఆ తాళం దొరకపుచ్చుకునేసరికి …. మాటల్లో చెప్పలేను.

ఇంకొక్కమాట చెప్పాలి.

నేను కారుకింద మూడుసార్లు చూసేను. అప్పుడు కనిపించలేదు. ఆలోచించి చూడండి. కారుతలుపు మనం తెరిచి దిగినప్పుడు, తలుపు అటు చక్రంవేపు తెరుచుకుంటుంది. మనం దిగి, నిలబడి భుజానికి తగిలించుకున్న సంచీలో తాళం పడేసినప్పుడు, కారుకీ, తాళం పడగల స్థానానికి కనీసం మూరెడు ఎడం ఉంటుంది.

మరి నాకెందుకు కనిపించలేదు? నేననుకోడం ఎవరో సద్గుణశీలుడు చూసి, మరొకరు దాన్ని దుర్వినియోగం చేయకుండా, ముందుచక్రం వెనక్కి తోసేసిఉంటాడని.

ఆహా, మంచివాళ్ళు ఇంకా ఉన్నారు. ఇలా ఆలోచిస్తుంటే, ఈ కథకి ఈవాక్యమే శీర్షికగా పెట్టాల్సిందేమో అనిపించడంలేదూ? మ్. ఇంకోసారి చేస్తాను అలా. ఇప్పటికింతే సంగతులు.

ooo

(ఫిబ్రవరి 15, 2019)

# 11. కుక్క పారిపోయింది (కథ)

అదొక చిన్న పల్లె. ఇది ఏదేశంలోనైనా కావచ్చు. పట్టుమని వంద ఇళ్ళు కూడా లేవు.

ఊరి శివార్ల అడవి. వెయ్యిమైళ్లు అనేక రకాల చెట్లు, పొదలూ, రాళ్లూ ముళ్లతో సన్నని కాలిబాటలూ ఉంటాయి. లేళ్ళూ, నెమళ్ళూ విచ్చలవిడిగా తిరుగుతూంటాయి.

ఊళ్ళోవాళ్ళు వినోదార్థం ఆ అడవిలో తిరుగుతూంటారు. అంతా శాంతియుతసహజీవనం.

ఒక ఇంట్లో ఒక స్త్రీ. సుమారు 30, 40 మధ్య వయసు. ఏదో పేరు పెట్టాలి కనక జేమీ అనుకుందాం.

జేమీ ఒకరోజు వినోదార్థం అడవిలో తిరుగుతుండగా ఒక కుక్కపిల్ల కనిపించింది. తెల్లగా, బొద్దుగా, ముద్దుగా ఉంది. జేమీ చేతిలో రొట్టెముక్కని గుచ్చి గుచ్చి చూస్తున్నట్టనిపించి, ఓ ముక్క చిదిపి దానినోటికి అందించింది.

కుక్కపిల్ల ఆత్రంగా ఆముక్క అందుకుని గబుక్కున మింగేసి మళ్ళీ అలా చూస్తూ నిల్చుంది.

మూడునిముషాలలో ఇద్దరూ ప్రాణమిత్రులయిపోయేరు.

మరో అరగంటయేక, జేమీ ఆ కుక్కపిల్లకి హనీ అని పేరు కూడా పెట్టేసి, ఇంటికి తెచ్చేసుకుంది.

ఆపైన వరసగా డాక్టరుదగ్గరకి తీసుకెళ్ళి పరీక్షలన్నీ చేయించడం, కుక్కతిళ్ళూ, తోలుపటకాలూ, డిజైనరు కుర్తాలూ వగైరాలన్నీ కొనడం జరిగిపోయేయి.

ప్రతిరోజూ సాయంత్రం హనీని షికారు తీసుకెళ్తోంది. జేమీకి ఇప్పుడు బోలెడంత పని. పనంటే పని కాదు. ఆనందం, ఆహ్లాదం, వినోదం, హర్షాతిరేకం. ఉక్కిరిబిక్కిరి.

ఎవరెదురైనా, ఎవరు ఫోనులో పిలిచినా అవే కబుర్లు.

ఎవరైనా ఇంటికొస్తే, హనీ విలాసాలే సంభాషణంతా.

హనీ ఎంతో తెలివైనది. కూర్చోమంటే కూర్చుంటుంది. పరుగుపరుగున రమ్మంటే పరుగెత్తుతూ వచ్చేస్తుంది. గుమ్మంలో పడిఉన్న పేపరు తీసుకొస్తుంది.

ఇంకా ఆశ్చర్యం. రెండుకాళ్లమీద నడుస్తుంది.

అవన్నీ జేమీయే నేర్పింది. అలా నేర్పడానికి జేమీ ఎంతో శ్రమ పడింది.

చెప్పక్కర్లేదు కదా. కొందరితో మాటలు తగ్గిపోయేయి. రాకపోకలు అంతంత మాత్రమే అయిపోయేయి. ఎవరైనా ఎక్కడైనా కనిపించి పలకరిస్తే మొక్కుబడిగా ఓ రెండు నిముషాలు మాటాడినా, ఇంట్లో పనుందంటూ తప్పుకుపోవడం కూడా జరుగుతోంది.

కొత్త కేటలాగులే జేమీ చదువు. అంతర్జాలంలో కుక్కలకి సంబంధించిన వస్తువులు, విశేషాలు సేకరించడమే ఉద్యోగం. కుక్కరిసార్టులు, కుక్కపందేలు ఎక్కడెక్కడున్నాయో చూసుకోడమే కాలక్షేపం, పందేలలో హనీని పెట్టకపోయినా. నిజానికి కుక్కలను అలా పందేలలో పెట్టడం బాగులేదని కూడా అనుకుంది. ఆ పరుగుపందేలశిక్షణకోసం వాటిని హింసిస్తారు. ఆభాగం జేమీకి సమ్మతం కాదు. కానీ హనీకి సరదాగా ఉంటుందని దాన్ని తీసుకెళ్తుంది.

ఏడాది తిరిగేసరికి కుక్కపిల్ల పిల్లతనం వదిలేసి, శునకరాజము అయిపోయింది. చూపరులకు రవంత బెదురు కలిగించేలా కూడా ఉందనొచ్చు.

ooo

రోజులు అన్నీ ఎప్పుడూ ఒక్కలాగే సాగవు. ఏదో ఒక అవాంతరం లేకుండా ఏ జీవీ బతకలేదు.

మామూలుగా రోజూ ఇచ్చినట్టే హనీకి చిన్నగిన్నెలో తిండి పెట్టి, తను ఒక పళ్ళెంలో రెండు రొట్టెముక్కలు పెట్టుకుని మరో కుర్చీలో కూర్చుంది.

ఆక్షణంలో ఏమి జరిగిందో చెప్పలేం కానీ హనీ ఒక్క ఉదుటున జేమీమీదకి దూకి, ఆమెముఖం రక్కేసి, ముక్కు కొరికేసి, ఒళ్ళంతా గీరేయసాగింది శివాలెత్తిపోతూ.

జేమీ ఓహ్, నో నో, హనీ హనీ, అంటూ హృదయవిదారకంగా అరుస్తూ హనీ పట్టునుంచి తప్పించుకోడానికి గింజుకుంటోంది.

ఆ అరుపులు విని దారిని పోతున్న ఒకాయన తొంగి చూసేడు ఇంట్లోకి, ఏమైందేమైంది అంటూ.

హనీ మూడో వ్యక్తి కంటబడగానే జేమీని వదిలేసి, ఒక్క గెంతు గెంతి, అతనిపక్కనించి దూసుకుని బయటికి పారిపోయింది.

ఆ వచ్చినవాడు చటుక్కున తప్పుకుని కుక్కగారికి దారిచ్చేసి, అది వెళ్ళిపోయేక, లోపలికొచ్చి జేమీముఖం చూసి గజగజ వణికిపోయేడు. ఒక్క క్షణం కాళ్ళూ చేతులూ ఆడలేదు.

ఆమె పట్టలేని బాధతో గోలపెడుతోంది రెండుచేతులతో ముఖం కప్పుకుని. చేతిమీంచి రక్తం ధారలుగా చారికలు కట్టింది. ఆంబులెన్సు, ఆంబులెన్సు ...

అంతవరకూ కొయ్యబారి నిలబడిపోయిన ఆగంతకుడు తెలివి తెచ్చుకుని 911కి ఫోను చేసేడు. మెడికల్ సిబ్బంది వచ్చి, జేమీకి తాత్కాలిక చికిత్స చేసి, ఆంబులెన్సులో ఆస్పత్రికి తీసుకెళ్ళేరు.

పోలీసులు వచ్చి వివరాలు కనుక్కున్నారు.

చెప్పడానికేమీ లేదు. రోజులాగే హనీకి తిండి పెట్టింది. ఆ తిండిలో తకరారు లేదు. రోజు పెడుతున్న కుక్కతిండే. పోలీసులు ఆ తిండి పరీక్షించడానికి లాబొరేటరీకి తీసుకెళ్ళేరు.

స్థానికరేడియో, "హనీ అను పేరుగల ఒక శునకము తప్పిపోయింది, ఎవరైనా చూస్తే వెంటనే పోలీసులకు తెలియజేయవలసినది. ఆ శునకము ప్రమాదకరమని గుర్తించవలెను,"అని ప్రకటన చేసింది.

ఆ ప్రమాదకరమైన కుక్క కనిపిస్తే, కాల్చివేయవచ్చునని కూడా అనుమతిచ్చేరు.

జేమీకి ఆవార్త అందింది. తన హనీ ప్రమాదకరము కాదని మొత్తుకుందావిడ. తనమీదకి "ఎందుకు దాడి చేసిందో చెప్పలేను కానీ ప్రమాదకరము కాదు. అంతటి మంచి కుక్క ఈ భూప్రపంచంలో మరెక్కడా ఉండద"ని నొక్కి చెప్పింది.

ooo

నాలుగు వారాలయింది. హనీజాడ లేదు. జేమీ హనీకోసం బెంగపడి చిక్కిపోతోంది. మిత్రులు మరో కుక్కని పెంచుకోమని సలహా ఇచ్చేరు కానీ జేమీకి మనసొప్పలేదు.

ఊళ్లో జనం వెయ్యికళ్ళు పెట్టుకు వెతుకుతున్నారు.

అక్కడ చూసేం.

ఇక్కడ చూసేం.

చూసేం కానీ హనీలా లేదు. మరెందుకు చెప్పడం అని అడక్కు. అదంతే. కొందరంతే.

చూసేం, పట్టుకోబోతే పారిపోయింది.

నాలుగు వీధులకవతల ఒక 15ఏళ్ల అబ్బాయి, పొరుగింటి పెంపుడుకుక్కని తుపాకీతో కాల్చేసేడు.

కుక్కయజమాని కోర్టులో దావా వేసేడు ఇది అన్యాయం అంటూ.

కాల్చినవాడితండ్రి, "తన కుమారుడికి 15 ఏళ్ళు, ముక్కుపచ్చలారని పసివాడు, ఆకుక్క హనీయే అనుకుని, భయపడి, తనని తాను రక్షించుకోడానికి తుపాకీతో కాల్చేసేడు, అంచేత వాడితప్పు కాదు" అని వాదించేడు.

జడ్జీగారు అవును పాపం, పసివాడు అని కేసు కొట్టిపారేసేరు.

అంత పసివాడిచేతికి తుపాకీ ఎందుకిచ్చేరు అని అడిగే నాథుడు లేడు. అమెరికాలో ఆత్మరక్షణ అలాటిది మరి.

ooo

మరో రెండువారాలు గడిచేయి. జేమీ కేసుసంగతి విని మరింత బాధ పడింది. తన హనీ పేరుమీద మరో కుక్క హతమయిపోవడం మరింత కష్టంగా ఉంది.

హనీని తాను మొదటిసారిగా కలుకున్నస్థలం దర్శించడానికి వెళ్ళింది జేమీ ఒకరోజు.

అక్కడ కూర్చుని చుట్టూ చూస్తుంటే వంద గజాలదూరంలో ఓ కుక్క ఒక్క క్షణం కనిపించి మాయమయింది.

తను ఉలిక్కిపడింది. లేచి అటు వెళ్ళాలనిపించింది కానీ కాళ్ళాడలేదు. శరీరంలో అణుమాత్రంగానైనా చలనం లేదు.

అదసలు హనీయేనా? లేక, తనకి మతి భ్రమించి అలా అనిపించిందా? హనీయే అయిఉండి, తనకి ఇక్కడే బాగుందని చెప్పడమా అది? తాను దానికి చేసిన సేవలన్నీ ఈ అడవిబతుకుముందు దిగతుడుపే అని చెప్తోందా?

ooo

((ఈకథకి స్ఫూర్తి టీవీలో ఒక వార్త. కథలో ఆవిష్కరించిన వృత్తాంతం టీవీలో చూసేక, కథ రాయాలనిపించింది. సాధారణంగా యజమానులకి కుక్కలు, ఆవులు, ఎద్దులు వంటి జీవాలతో మంచి అనుబంధం ఏర్పడుతుంది.

**ఆ అనుబంధంగురించి చాలా కథలే వచ్చేయి తెలుగులో. నూటికో కోటికో విపరీతాలు కూడా జరగవచ్చు. ఆ క్షణానికి కలిగిన మనోవైకల్యం కారణం కావచ్చు. యజమానులందరూ జాగ్రత్తగా ఉండండహో అని హెచ్చరించడం నాఉద్దేశం కాదు. ఏదో కారణంగా ఇలా జరిగింది. ఇది సర్వసాధారణం కాదు కనక కథకి స్ఫూర్తి అయింది. అంతే.**

తల్లిప్రేమతో పిల్లలికి స్వేచ్ఛ ఇస్తే త్యాగం అని పేరు పెడతాం. జంతువులని ప్రేమతో పెంచడం జీవకారుణ్యం అంటాం. వాటికి అనేక రకాల తర్ఫీదులివ్వడం వినోదమే కాదు మనవిలువలు వాటికి అంటగట్టడం కూడా. కానీ సహజసిద్ధంగా ఆరుబయళ్లలోనూ, అడవిలోనూ తిరిగే జంతువులు మనం ఇచ్చే "సౌకర్యాలూ, సేవలూ, ఆభరణాలూ, తర్ఫీదులు" కోరుతున్నాయా, మురిపోతున్నాయా అని ఎవరైనా ఎప్పుడైనా ఆలోచించేరా?

ఈ కథలోని ప్రధానసంఘటన – ముద్దుగా పెంచుకున్న కుక్క యజమానురాలిముఖం కొరికేయడం – వార్తల్లో చూసేను. ఛిన్నాభిన్నం అయిపోయిన ఆముఖం చూసేను. ఇది నిజంగా జరిగిన సంఘటన.

ఆతరవాత, National Geographic channelలో ఇలాటివి మరి కొన్ని సంఘటనలు చూపి, ఎందుకిలా జరుగుతుందన్న ప్రశ్నకి సమాధానం ఇంకా దొరకలేదనీ, పరిశోధనలు జరుగుతున్నాయనీ చెప్పేరు.

ooo

(మార్చి 13, 2019)

## 12. ఎంతెంత దూరం (కథ)

కాఫీ సేవిస్తున్న కావేరి ఫోనుగానం విని ఉలికిపడి ఎవరై ఉంటారు చెప్మా అనుకుంటూ తీసి హలో అంది.

"నేనండి. ఆమ్నీ"

ఆమ్నీ ... ఎవరు చెప్మా, ఎక్కడా విన్నట్టు లేదు. "ఆ..మ్మీ?????..."

"ఓ, అన్నట్టు మీకు తెలీదు కదూ ... సౌదామిని అంటే వీళ్లకి నోరు తిరగదు అంత పెద్ద పెరు. అందుకని కత్తిరేసేసేను. హీహీహీ. ఆమనీ అన్నా తికమకగా చూస్తారు. అంచేత ఆమ్నీ చేసేను రామ్నీలా అని చెప్తున్నాను."

"హాహా. సౌదామిని. సరే. నిజమేలే. నేనూ చూస్తున్నాను మనపేర్లతో వీళ్ళకి తంటాలు. మంచిపని చేసేవు."

"అదేంటో రెండు ఏడెక్షరాలు కూడా పలకలేరు. నాకైతే ఇష్టంలేదు మార్చడం కానీ ..,"

"కాస్లే. మనం వాళ్ళింటికి వచ్చేం, కానీ మనింటికి వాళ్ళు రాలేదు మరి. ఇంతకీ ఎప్పుడొచ్చేవింతకీ, ఎక్కడున్నావు,?"

"అమెరికానుంచే. న్యూయార్కు వచ్చి వారం రోజులయింది. ఇక్కడ నాతో చదువుకున్నవాళ్ళున్నారు. వాళ్ళతో నాల్రోజులు గడిపి, మీఊరొస్తున్నా. అక్కడ వర్క్ షాపు నెలరోజులపాటు. అంచేత అక్కడే మిగతా మకాం అన్నమాట." గొంతులో హుషారు, మనసులో దిగులు.

"ఊఁ బాగుంది. మీ వర్క్ షాపువాళ్ళే నీమకాం ఏర్పాటు చేస్తున్నారు కాబోలు. చాల్రోజులైంది నిన్ను చూసి. రాగానే చెప్పుఎక్కడ దిగుతావో. నేనొచ్చి ఇంటికి తీసుకొస్తాను."

"... ఊఁ. లేదు. వాళ్ళేఏర్పాట్లూ చేయలేదు. ఏవో ఎడ్రెసులిచ్చేరనుకోండి. నాకేమో ఊరు కొత్త కదా. ... మీకేమైనా తెలుసేమోనని ... మ్.. అదే ఆ ఎడ్రెసులిస్తే మీరు చెప్పగలరేమోనని ...?"

“నాకూ ఊరంతగా తెలీదు. ఏదో  ఇక్కడిక్కడ మాయింటిచుట్టూ నాలుగు వీధులు తిరిగడమే కానీ …. ఎంత దూరమో మీ వర్క్ షాపు మరి. దూరాలు ఫరవాలేదనుకుంటే మాయింట్లో ఉండు.”

“నిజంగానే? మీకు ఇబ్బంది లేదంటేనే…. మిమ్మల్ని శ్రమపెట్టడం నాకిష్టం లేదు.”

“ఇబ్బందేముంది. నాతో పాటే … నేనేమీ నీకు రాజభోగాలు జరపలేను కానీ…”

“అయ్యో భలేవారే. నిజానికి మనవాళ్లమొహం కనిపించడమే రాజభోగం.  వారంరోజుల్నుంచీ చూస్తున్నా. నాకైతే ఏదో మాయలోకంలో ఉన్నట్టుంది.”

“అవును. కొత్తలో అలాగే ఉంటుంది. ఇంతకీ ఎప్పుడొస్తున్నావు? ఫ్లైటు ఏదో చెప్తే ఎయిర్పోర్టుకొస్తాను.”

… … …

“స్నానం చేస్తావా?”

“మీరు కానివ్వండి. నాకేం తొందర లేదు.”

… … …

“అప్పుడే అయిపోయిందా?”

???

“బజారుకెళ్దాం, రా. నీకిష్టమైన కూరలు చూసుకోవచ్చు.”

“నాకదేం లేదండి. మీరేం చేస్తే నాకదే ఇష్టం. మీరెళ్ళి రండి.”

… … …

“అరె, అప్పుడే వచ్చేసేరు. నేనింకా గంట, గంటన్నర పడుతుందనుకున్నాను.”

“… ఏదో కావలిసివ నాలుగూ తీసుకుని వచ్చేస్తాను. బజార్లో గంటలతరబడి తిరగడం నచ్చదు.”

“నేనింకా చాలాసేపు పడుతుందేమోనని …”

“సరేలే. … వద్దొద్దు. ఛానెల్ మార్చక్కర్లేదు. ఏదో చూసుకో.”

“హీహీ. ఏదోలెండి. మీరు మీకాలపు వోటు చూస్తారు.”

“వాటిలో స్పష్టంగా మాటాడతారు. పూర్తివాక్యాలు మాటాడతారు. నాకుఅర్థం అయేవి అవే మరి. హాహా.”

… … …

“ఎండ తిరుగుమొహం పట్టింది. పద అలా కాస్త తిరిగొద్దాం.”

“లేదండి. నేను రేపటిక్లాసుకి సిద్ధం కావాలి. చాలా పని. చంపుకుతినేస్తున్నారు. మీరెళ్ళిరండి. మీకు వాకింగు అలవాటు.”

???

000

“ఆదివారం మాస్నేహితులు డిన్నరుకి పిలిచేరు. మిమ్మల్ని తీసుకురమ్మన్నారు.”

“ఆఁ .. మ్ … నేనెందుకులెద్దూ. నువ్వెళ్ళు.”

“అదేం లేదండి. ఫరవాలేదు రండి. మీకు అంతగా విసుగనిపిస్తే కొంచెంసేపుండి వచ్చేద్దురుగానీ.”

…

“ఎందుకు నవ్వుతారు. వాళ్ళకి మిమ్మల్ని చూడాలనుంది.”

“వాళ్ళకసలు నన్ను తెలీదు కదా ఏం చెప్పేవేమిటి?… సరేలే. చూదాం.”

… … …

“మాది కూడా విజయవాడేనండి.”

“అలాగా. విజయవాడలో ఎక్కడ?”

“మాఅమ్మ కూడా మీలాగే …”

"మీకు ఆలస్యం అయిపోతుందేమో మీరు తినేయండి."

"ఫరవాలేదు. తొందరలేదు. అందరూ వచ్చేవరకూ ఉంటాను."

"నేను తెచ్చిన విడియో ఏదీ?"

."ఆబల్లమీద పెట్టేను."

"ఏబల్లమీద?"

"గిరిధర్ ఇంకా రాలేదేం?"

"వెయ్యికాళ్ళజెర్రి ఆడు. ఎక్కడ తిరుగుతున్నాడో."

"జానీని తీసుకొస్తానన్నాడు. అక్కడ ఆలస్యంఅయిందేమో."

"జానీగాడ్నా? సరి ఇవాళొచ్చినట్టే."

హాహాహ హాహాహ హాహా

"అత్తయ్యగారూ, మీకు విసుగేస్తే చెప్పండి. వెళ్ళిపోదాం."

"లేదులే. మీకాలం పిల్లలు ఇలా మాటాడుకోడం చూసేఅవకాశం నాకెక్కడ కుదుర్తుంది మళ్ళీ."

"హాహా. మీరు భలే మాటాడతారండి,"

"మాటలేనా? మీపులిహోర కూడా అద్భుతం అని విన్నాను."

"హా ఎక్కడ విన్నారేమిటి?"

"ఇంకెక్కడ?"

"హోహో. చెప్పక్కర్లేదు."

"ఓ. నాకు చెప్పలేదే అమ్మీ."

"ఇంకా ఇడ్లీ, పూరీ, దోశ... "

“ఏంటి ప్రతిరోజు మెనూ అంతర్జాలంలో ప్రకటిస్తున్నావేమిటి?”

“లేదత్తయ్యగారూ, వాళ్ళు నన్ను ఏడిపించడానికి అంటున్నారు.”

“లేదు మామ్మగారూ, మమ్మల్ని ఏడిపించడానికి ఇలా రోజు చెప్తుంది.”

“హ్మ్. నాక్కూడా మీలాటి అత్తయ్యగారొకరు దొరికితే బాగుండు ఈఊళ్లో.”

“నాకు ఈఊళ్లోనే అక్కర్లేదు. పొరుగూరయినా రెక్కలు కట్టుకు వాల్తానక్కడ.”

“విడియో దొరికింది. రండి. రండి. షోటైం.”

000

ఆగాగు. ఇక్కడే చూడు. ష్ డైలాగు వినాలి .. అటు చూడు … డైలాగంటే అమ్మో …మ్. ఆఅమ్మాయి బాగులేదు.. అయితే అదరగొట్టేసేది. అదుగో ఇక్కడే వావ్ … షా ఏడీ ఇంకా రాలేదే … మేగీ తీసుకొస్తానంది… హా సరే ఆవిడ డ్రైవింగంటే మిల్వాకీలో బయల్దేర్తే అయోవాలో తేల్తుంది. హాహాహ పోదూ మరీ అంత ఘోరం కాదు ఆవిడ … హా ఆపరా గోల … మామ్మగారూ ఇదుగో చూడండి ఎంత బాగా చేస్తోందో … నన్నడిగితే అదీ ఏక్షనేనా … . అయితేనా … సర్లే నిన్నెవరూ అడగలే … పోవోయ్ … అన్నట్టు … ఆ రాజరేమిటి క్లాసులో … హిహిహ అదంతా ఆ షీలాకోసంలే … ఓర్నాయినా ఎన్ని పోజులో …ప్రొఫెసరు … ససవ …

రండి. భోజనం సిద్ధం. తిన్నాక మాటాడుకోవచ్చు

అదేం లేదండి. మాకు తినడం, మాటాడుకోడం అన్నీ ఏకకాలంలో సాగుతాయి.

అవునన్నట్టు నిన్నొకటడగాలి.

తరవాత చూద్దాంలే. పద, పద ..

000

“మీకు చాలా విసుగేసిందేమో అత్తయ్యగారూ.”

“లేదు. నేనూ బయల్దేరేముందు అనుకున్నాను కానీ విసుగనిపించలేదు.”

“మాకు కామన్ అనేక విషయాలు. కొందర్నయితే నేను చూసి పదేళ్లు పైనే. మీకేమో అయోమయం అవి.”

“అయోమయమే కానీ మీఅందరి హుషారూ, సరదా చూస్తుంటే నాకు తమాషాగానే ఉండింది. మరో సినిమా చూస్తున్నట్టు.”

“హాహా. ఏ ఫారిన్ సినిమానో చూస్తున్నట్టుందా?”

“హా. అలాగే అనుకోవచ్చు. అసలలా ఉరకలు వేసే ఉత్సాహం కూడా అంటు జాడ్యమే. శుభ అంటుజాడ్యం. అంతమంది అంత హుషారుగా చురుగ్గా గలగల్లాడుతూ నవ్వుతుంటే నేను కూడా నవ్వకుండా ఉండలేకపోయేను మరి.”

“మీరలా అనుకుంటే సరే. మీరు వాళ్లకి చాలా నచ్చేరు. నాతో అదే అన్నారు కూడాను.”

000

“అంతమందినీ ఒక్కసారి పిలిస్తే కష్టం కానీ ఒకరిద్దరు చొప్పున అప్పుడప్పుడు పిలు భోజనానికి.”

“ఆఁ. నిజంగానే… అంటే … మీకు కష్టం కాదనుకుంటేనే … బోలెడు పొంగిపోతారు ఈమాట చెప్తే.”

“కష్టం లేదులే.”

“మీతో మాటాడుతుంటే చాలా పెద్దవాళ్ళతో మాటాడుతున్నట్టు ఉండదు అన్నాడు గిరి.”

“మ్… పెద్దా చిన్నా అంటూ మనం గిరులు గీసుకుంటాం. గుంపులో ఉన్నప్పుడు ఎవరిగిరి వారిదే అయినా కొంత overlap కూడా ఉంటుంది. మిగతా భాగం అంతా వేరు అయినా ఆ చిన్న భాగంలో మాత్రం గిరులప్రసక్తి ఉండదు. తరాల అంతరాలూ గుర్తుకురావు. అది సంఘుతత్వం, మనిషితత్వం అనుకుంటాను.”

000

(జూన్ 25, 2019)

## 13. ధైర్యం కథ

“నాసంగతి మీకు తెలీదు,” అన్నాడతను విసురుగా గేటుతలుపు తోసుకుని లోపలికొస్తూ.

వరండాలో వాలుకుర్చీలో కూర్చునిఉన్నాను. తలెత్తి అతనివేపు చూసేను.

“ఆమాత్రం ధైర్యం లేకుండానే ఇంతదూరం వచ్చేనా?” అన్నాను మెల్లిగా.

హ్మ్ అని, “చూద్దురుగాని,” అనేసి గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయేడు.

నిలువెత్తు మనిషి. సన్నగా ఉన్నా దృఢంగా ఉన్నాడు.

నేను పిసరంత మనిషిని. అతనిపక్కన నిలబడితే జబ్బలవరకూ వస్తానేమో.

ఆక్షణంలో అతను నన్ను ఊచిపుచ్చుకు ఒక్కటిచ్చుకుంటే అక్కడ నన్ను రక్షించే నాథుడెవరూ లేడు.

మెతకమనిషిని. మాటకి మాట టకటక జవాబులు చెప్పగల చేవ లేదు నాకు. చెప్పలేను. ఆక్షణంలో మాత్రం నానోట ఆమాట వచ్చింది, “ఆమాత్రం ధైర్యం లేకుండానే ఇంతదూరం వస్తానా?”

అయిదువందల మైళ్ళు. కాలం, ఖర్మం కలిసొచ్చి పెద్ద ఉద్యోగమే, పాతికమందిమీద అజమాయిషీ, వచ్చింది కానీ నాకు అంత వయసూ లేదు, అనుభవమూ లేదు.

అతనికి అంత కోపం రావడంలో తప్పు లేదు.

విషజ్వరంతో ఆస్పత్రిలో చేరిన నాలుగోరోజు మరో గుమాస్తా వచ్చి అతను పోయేడని చెప్పేడు. సంతాపసూచకంగా నేను ఆఫీసు మూసేసేను ఆరోజుకి.

ఆస్పత్రికి ఫోను చేసి వివరాలు కనుక్కోకపోవడం, పరిస్థితి నిర్ధారించుకోకపోవడం నాతప్పు.

అనుభవం లేక పొరపాటు జరిగిపోయింది.

ఆతరవాత అతను కోలుకుని ఆఫీసుకొచ్చేడు.

ఆసాయంత్రం మాఇంటికొచ్చేడు.

అతను కోపంగా అన్నాడు.

నేను మెల్లిగా జవాబిచ్చేను.

అమ్మ పక్కగదిలో ఉంది. ఏమయిందని అమ్మ అడగలేదు. నేను చెప్పలేదు.

మర్నాడు మామూలుగా ఆఫీసుకి వెళ్ళేను.

అతను ఆఫీసుకి వచ్చేడు.

ఇద్దరం మామూలుగా ఎవరిపని వారు చేసుకుంటూ పోయేం.

మరే విపరీతాలూ జరగలేదు.

000

మరో వారంరోజులుండి అమ్మ మాఊరు వెళ్లిపోయింది.

మరో రెణ్ణెల్లతరవాత శలవులకి మాఊరు వెళ్లేను.

అమ్మ హాల్లో ఎవరితోనో మాటాడుతోంది. నేను పక్కగదిలో ఉన్నాను. అమ్మమాటలు వినిపిస్తున్నాయి.

“… … …  అంది. దానికి చాలా ధైర్యం. నాకు దాన్నిగురించి చింతలేదు.”

నామాటతో అమ్మబెంగ తీరిపోయింది.

అమ్మమాటతో నాకు మరింత బలం వచ్చింది.

అమ్మకి నాగురించి బెంగలేదింక అనుకుంటే అదో తృప్తి, మరింత ధైర్యం.

000

(డిసెంబరు 14, 2019)

## 14. Tooth fairy ఉంది!! (గల్పిక)

అలవాటుప్రకారం, జోళ్లేసుకుని, తలుపు తాళంవేసి, కారిడారులో మలుపు తిరుగుతుంటే ఓ డాలరు చుట్ట కనిపించింది. లేదు. ఇలా సొమ్ము కళ్ళ బడడం అలవాటు కాదు. అందుకే చెప్పుకోడం. ఇప్పుడే ఇలా ధనలక్ష్మి దర్శనం.

చుట్టూ చూసేను. కనుచూపుమేరలో ఎవరూ కనిపించలేదు. ఒంగి ఆ కాగితపుచుట్ట తీసి విప్పటోతే మరో డాలరూ, మరో డాలరూ, మరో డాలరూ, మరో ఐదూ, మరో ఐదూ … మొత్తం 14 డాలర్లు. హా.

ఒకటో రెండో అయితే ఊరుకోవచ్చు కానీ మరీ 14 అంటే కొంచెం ఎక్కువే కద.

పైగా ఆలోచించు. ఎవరు అలా నోట్లు చుట్ట చుట్టుకు పెట్టుకుంటారు?సాధారణంగా పర్సులో పెడితే మధ్యకి ఒక మడతగా ఉంటుంది. కానీ ఇలా చుట్ట? ఆ మూల వాటాలో 12 ఏళ్ళ అమ్మాయి ఉంది. ఏ బేబీసిటింగు డబ్బులో కావచ్చు. లేదా ఏ నీళ్ళపైపో రిపేరు చేయడానికి వచ్చిన చికానో పారేసుకున్నాడేమో!

అనేకవిధాల అలోచించి, Laundryగది తలుపుదగ్గర పడి ఉంది కనక ఎవరో లాండ్రీ చేసుకునేవేళ జేబులోంచి జారిపడి ఉంటుందనే నిర్ణయానికి వచ్చి, ఆ తలుపుమీద నోటీసు పెట్టేను

– “సోమవారం ఉదయం 9 గం. కి మీరు 14 డాలర్లు లాండ్రీగదిముందు పారేసుకునిఉంటే

…. నెంబరుకి ఫోను చేయవలెను. లేదా … వాటాకి వచ్చి తలుపు తట్టవలెను” అని.

గంట పోయేక మేనేజరు ఫోను చేసింది, “నీనోటీసు చూసేను. అలా అన్ని వివరాలతో పెడితే, ఎవరైనా రావచ్చు నాదే నాదే అంటూ. ఇంతకుముందొకసారి అలా జరిగింది” అన్నాడు.

“మరి ఏం చేయను?”

“అంత హరికథ కాకుండా, ఎవరైనా సొమ్ము పారేసుకుంటే, ఈ నెంబరుకి ఫోను చేయండి సూక్ష్మంగా అని పెట్టు. అప్పుడు ఎంత పారేసుకున్నారు, ఎక్కడ పారేసుకున్నారు, ఎలా పారేసుకున్నారు అని ఆరాలు తీయడానికి వీలు” అన్నాడు.

హమ్మో ఎంత అజ్ఞానం నాది అనుకుని, అతని సలహాప్రకారం మరో నోటీసు పోస్టు చేసేను.

రెండు రోజులయింది.

ఫోను రాలేదు. మామేనేజరే కారిడారులో కనిపించి, "పొద్దొద్దూ 14 అంటే ఎంతకనక. తీసెయ్ ఆ నోటీసు" అన్నాడు.

నేనూ అదే అనుకుంటున్నాను. నాఫోన్నెంబరు అలా ఆ తలుపుమీద ప్రకటించడం నాకు కూడా బాగులేదు. నాగీత బాగుంది ఆ పొద్దు అనుకుని ఊరుకుంటే పోలే అనుకున్నాను.

అదుగో అప్పుడే నాకు tooth fairy మాట మనసులో మెదిలింది.

000

మామూలుగా చిన్నపిల్లలకి ఆ ఊడిపోయిన పన్ను తలగడకింద పెట్టుకు పడుకుంటే మర్నాడు పొద్దున్న టూత్ ఫేరీ బహుమతి దొరుకుతుందని చెప్తారు ఊరడింపుగా. అన్నట్టుగానే ఓ కాన్డబ్బు దొరుకుతుంది మర్నాడు ఉదయం.

ఈమధ్య కొంతకాలంగా ఓ పన్ను ఉన్నానంటూ నాకు దినదినమూ గుర్తు చేస్తోంది. తింటున్నప్పుడు కాదు, పలు దోముపేళ. అదైనా పెద్ద నొప్పి కాదు. ఊరికే నరాలకి తగిలినట్టు చిన్న కుదుపు.

దంతదైవాన్ని దర్శించుకోవాలి. హ్మ్.

అమ్మాయి ఊరినించి వచ్చేక ...

రెండు రోజులు పోయేక మరో హెచ్చరిక. ఇగుళ్లు వాచినట్టు.

అమ్మాయి పాపం రెండువారాలు పనితో అలసిపోయుంటుంది. రెండు రోజులు పోయేక చూడాలి.

పళ్ళు తోముకుంటుంటే సింకులో ఎరుపుజీర.

తప్పదు రేపు పిలవాలి అమ్మాయిని.

హుం. నోట్లో పన్ను ఊగుతున్నట్టుంది.

హాహా. పట్టుకోబోతే టుపుక్కున ఊడి వచ్చేసింది పిల్లల పాలపళ్ళలా.

శనొదిలిపోయింది. డాక్టరుఖర్చు తప్పిపోయింది.

000

నాకిది రెండో బాల్యం కనక మరో రెండు కాన్డబ్బులు ఎక్కువ దొరికేయి.

నిజం. tooth fairy ఉంది!!

000

(ఫిబ్రవరి 22, 2020)

## 15. అలనాటి చెలికి ఆఖరిఉత్తరం (గల్పిక)

ప్రియమైన జయసూర్యబాలాకుమారికి,

నీ ఉత్తరాలు అందేయి

నీ ఘనవిజయాలూ, నీ పిల్లల అభ్యున్నతి తెలివిడి అయింది.

మనం కలుసుకుని అర్ధశతాబ్దం పైమాటే కదూ

నామనోవీధిలో ఇంకా పచ్చిగానే ఉన్నాయి ఆనాటి కతలూ వెతలూను.

అన్నట్టు నీకు తెలీని సంగతి నాకు prejudices ఎక్కువేనన్నది.

నువ్వు నాకొనరించిన మేలు, కలిగించిన నొప్పి గుర్తున్నాయి

అలాగే నేను నీకు చేసిన సాయాలు, నిన్ను పెట్టిన హింసానూ

జీడిమరకల్లా స్థిరంగా తిష్ఠ వేసేయి నామనోఫలకంపై.

మంచయినా చెడయినా మరిచిపోలేను నేను మరి.

అప్పట్లో నీ ప్రతి చేష్టకి జేజేలు కొట్టిన ఓపిక కొరత పడిందిప్పుడు.

నాకు ముదిమి వచ్చేసినట్టేనని సాధికారకంగా ప్రకటించుకుంటున్నాను.

నువ్వింకా అప్పటి బాలాకుమారివే మరి.

మొదట్లో అద్భుతం అన్నాను కదూ నీమొదటికథకి మూడో బహుమతి వచ్చినప్పుడు.

నీతొలిచూలు కుమారజననం విని హర్షాతిరేకంతో తలమునకలయేనని చెప్పినట్టే గుర్తు.

నాలుగోసారి బహుమతికో సత్కారానికో కాబోలు అహో ఒహో అంటూ ఊః సంబరపడిపోయేను.

తొమ్మిదోసారి ఓహో అన్నాను.

యాభై ఏళ్ళ తరవాత, ఈరోజుల్లో బహుమతులు ఎవరికి రావు కనక అనిపిస్తోంది.

ఈనాడు ఘనసంపాదనలు లేని పిల్లలెక్కడున్నారులే అన్న తేలికభావం కూడా అలాగే.

లేదింక నేను జయజయధ్వానాలు చేయలేను.

నీకిది అర్థం కాదు కనక నేనే చెప్పకతప్పదు.

నువ్వూ నేనూ చీలిపోయి చెరో దిక్కూ చాలా దూరం వచ్చేసేం.

నీ ఉత్తరాలు మోసుకొచ్చే శుభవార్తలు అతకడం లేదిప్పుడు టపాలకింద వ్యాఖ్యల్లాగే.

అప్పటి నాకూ ఇప్పటి నాకూ పోలికే లేదు.

ఇప్పటి నేను నీకు తెలీదు.

నువ్వు మాత్రం మారలేదు

అందుకే నాతో భేటీ కుదరదింక.

అప్పట్లా నేను నీ ప్రతికబురుకీ ఉప్పొంగిపోలేను, మన్నించు,

మరి ఉంటానింక.

మనకథ ఇంతటితో సమాప్తం.

ఇదే నీకు నాఆఖరి ఉత్తరం.

ఇట్లు

మరో మాలిని

000

(రచయితమాట – కొన్ని దశాబ్దాలతరవాత కొందరు అనుభవాలమూలంగా, జీవితంలో ఎదుర్కొన్న సంఘటనలమూలంగా మారిపోతారన్న సంగతి కొందరు గుర్తించరు అన్న ఆలోచనకి ఇది అక్షరరూపం.)

(ఆగస్టు 30, 2020)

## 16. ఏకాకి? (కథ)

కాకీ, కాకీ, ఏకాకీ,

ఏ కాకీ ఏకాకి కాదు.

గుంపులో కాకివే గానీ ఏకాకివి గావు."

"నేనేకాకినే ఏకాకినే"

"కాదు గాదు. నువ్వేకాకివి కావు.

గుంపులో కాకివే కానీ ఏకాకివి కావు.

– మోసుకొచ్చిన ఊసులు పంచిపెట్టేవు

– కోసుకొచ్చిన చివుళ్ళు మెసవబెట్టేవు."

"నేనేకాకినే, నేనేకాకినే. నేను మోసుకొచ్చిన ఊసులు వినండి

నేను కోసుకొచ్చిన చివుళ్లు తినండి

నేను రాసుకొచ్చిన కాకివార్తలు వింటే వినండి, లేకుంటే లేదు.

గుంపులో కాకిని మాత్రం కాను గాక కాను

గుంపులో ప్రతికాకీ ఒక కాకి, కాకీ కాకీ కాకీ కాకీ

ఒక్కొక్క కాకీ చేరి ఓ గుంపు, నువ్వొప్పుకున్నా, ఒప్పుకోకున్నా."

హ్మ్.

ఏ కాకీ ఏకాకి కాదు. ఒక్కొక్కటే విడివిడిగా ఎగుర్తూ కనిపించినా గుంపులోనూ ఉంటుంది.

ooo

కూతురికి పెళ్లి సంబంధం చూడడానికి పట్నం వచ్చేడు అనంతరావు.

“అందరూ బాగున్నారా?”అన్న ప్రశ్నకి సమాధానం, అనంతరావు ఇంటిసంగతులు చెప్పేడు.

“ఇందుకే నేను పెళ్లి చేసుకోలేదు,” అన్నాడు తమ్ముడు నిరంజనం.

అనంతరావు కళ్లు చిట్లించేడు. ఆహ్ అన్నట్టు తలాడించేడు.

నిరంజనం మళ్లీ అందుకున్నాడు, “నాకు నీలాగ సంసారబంధాలు లేవు. నేను పోతే నాభార్య దిక్కులేకుండా పోతుందేమో, పిల్లల చదువులూ, ఉద్యాగాలూ, పెళ్ళిళ్ళూ ఎలా అవుతాయో, వాళ్లు వృద్ధిలోకి వస్తారో రారో అంటూ అతలాకుతలం అయిపోనక్కర్లేదు. బిపీ, గట్రా తెచ్చుకోక్కర్లేదు”.

అనంతరావు చురుగ్గా తమ్ముడివేపు చూస్తూ,“ఎవరికి బీపీ?”అన్నాడు.

నిరంజనం అన్నని తినేసేట్టు చూసి, విసురుగా లేచి వెళ్లిపోయేడు.

ooo

పదిరోజులయింది. మంచంమీదున్నాడు నిరంజనం.

పదిరోజులక్రితం కాలు జారిపడ్డాడు. మోకాల్లో ఎముకలు విరిగేయి.

ఫోనుమీద ఫోనుమీద కాలులే కాలులు ఆగకుండా …

– అసలేమైందేమైంది?

– అయ్యయ్యో, బాబుగారెలా ఉన్నారు?

– ఏమైనా కావాలిస్తే చెప్పండి, ఆఘుమేఘాలమీద పంపిస్తాను.

– అంకులికి నొప్పి ఎక్కువగా ఉందా?

– మామయ్యగారూ, డబ్బుకి ఇబ్బంది పడకండి, పంపిస్తాం.

– తాతగారు మంచంమీదున్నారనగానే పరుగెత్తుకు వచ్చేసేను.

– మిమ్మల్నిలా చూడ్డం చాలా బాధగా ఉంది, గురూగారూ!

– బెస్టు డాక్టరుని చూడండి. మనీ వేస్టని హెసిటేటు చేయకండి.

– మంచి డాక్టరుని చూడండి, డబ్బుకోసం వెనుదీయకండి.

… … …

సీతకి తల తిరిగిపోయింది వాళ్లందర్నీ చూడగా, వాళ్లమాటలు వినగా వినగా.

000

మంచంపక్కన కూర్చున్న సీత విసుగ్గా ఫోను బల్లమీద పెట్టి, చెయ్యి విదిలించుకుంది. ఈ ఫోనుకాలులతో చెయ్యి పట్టేసింది.

"నీమోకాలు కాదు కానీ నాగూడ పట్టేసింది,"అంది సీత ఎడంచేతో కుడిచెయ్యి ఒత్తుకుంటూ.

"వాళ్లకి పాపం నేనంటే అభిమానం. పోనీ వాళ్లనే రమ్మను. ఎవర్ని పిలిచినా ఇట్టే వచ్చి వాల్తారు,"అన్నాడు నిరంజనం.

సీత తీక్ష్ణంగా తమ్ముడివేపు చూసింది. సంసారజంజాటం లేనిది ఎవరికి–వీడికా తనకా?

"ఏమిటి, నవ్వుతున్నావు?"అన్నాడతను.

"నిన్ను చూసే,"

"ఎందుకూ?"

"నాకెవరూ అఖ్ఖర్లేదు, నాకీ సంసారజంజాటం వద్దు, పెళ్ళీ పెటాకులూ అంటూ సంసారం బురదలో ఇరుక్కోను అంటూ ఉపన్యాసాలిచ్చేవు. ఒక ఆడమనిషిమెళ్ళో పుస్తి కట్టలేదేమో కానీ వీళ్ళంతా ఎవరు, వీళ్ళకోసం నువ్వు పడ్డ తాపత్రయం ఏమిటో చెప్పు. వీళ్ళ కష్టసుఖాలూ, పిల్లలచదువులూ, పెళ్లిళ్ళూ, … అవన్నీ జంజాటం కాదా?"అంది చిన్నగా నవ్వుతూ సీత.

“అది వేరూ, వాళ్లకి అవుసరం అయినప్పుడు సాయం చేయడం వేరు, దినదినం, క్షణక్షణం సంసారజంఝాటంలో గిలగిల కొట్టుకుపోవడం వేరూ.”

“అదేరా, బుద్ధిహీనుడా, నేనంటున్నది కూడా. పూర్తిగా సంసారం నెత్తికెత్తుకుని మంచీ చెడ్డా, కష్టం సుఖం అనుభవించే గుండెబలం నీకు లేదు. వాళ్ల అవుసరాలకి, నీకు వీలయినప్పుడు, నిజం చెప్పాలంటే నీకు సరదా అయినప్పుడు వెళ్తావు, వాళ్ళని ఆదుకుంటావు. అంత తేలిగ్గాను తప్పుకోగలవు కూడా. పెళ్ళిప్రమాణాలు లేవు కానీ నీకు సంసారం బాగానే ఉంది. నీకు వాళ్ళొక కాలక్షేపం. లక్షణంగా పెళ్ళి చేసుకుని బాధ్యతలు నెత్తినేసుకునే గుండెల్లేవు. ఇలా ఒక మాయసంసారం ఏర్పరుచుకున్నావు. నీకంటే నేనే నయం. మంచీ చెడ్డా అన్నీ తలకెత్తుకునే నిబ్బరం ఉంది నాకు.”

“హాఁ …” వెర్రిగా అక్కవేపు చూసేడు నిరంజనం.

నాకేమీ అక్కర్లేదు అనుకునేవారు కూడా సమాజంలో ఏదో ఒకంగా మమేకం అయిపోయే ఉంటారు. కొందరు ఒప్పుకుంటారు. కొందరు ఒప్పుకోరు, అంతే.

000

(ఫిబ్రవరి 2, 2021)

## 17. దేవుడుగారికి విన్నపము (గల్పిక)

మహారాజరాజశ్రీ గౌరవనీయులైన, పూజనీయులైన దేవుడుగారికి,

భక్తిప్రమత్తులతో, వినయవిధేయతలతో అనంతకోటి జీవరాసులలో ఒక అణుమాత్రజీవియును తమదాసానుదాసియును అయిన ఏను సేయంగల విన్నపములు.

తమరు జ్ఞాననిధి కావునను, నేను అజ్ఞానాంధకారతిమిరములో పడి మునిగితేలుచున్నదానను కనకనూ, మరియు నన్ను పుట్టించినవాడవునూ, గిట్టింపగలవాడవునూ నీవే అగుటంజేసి, ఈ విజ్ఞాపన తమదివ్యసముఖమునకు సమర్పించుటకు నాకు యోగ్యత గలదని నమ్ముచున్నాను. మాపెద్దలును సకలసంశయములు ఆర్పనూ దీర్పనూ నీవే తగుదువని నాకు ఉగ్గుబాలతో నూరిపోసియున్నారు.

నన్ను పుట్టించినవాడవు నీవే. అది అయిపోయింది కనక మనము చేయగలిగిందేమీ లేదు. భగవంతునకైనను గతమును మార్చగల శక్తి లేదని మానాయనమ్మ చెప్పుచుండెడిది. అందుచేత ఆవిషయమై నేను చెప్పగలిగినది గానీ అడుగదగినది గానీ ఏమియు లేదు. గిట్టుటవిషయమై నాకు కొన్ని అభిప్రాయములు గలవు గానీ అవి ఇప్పుడే మొదలిడిన మామిత్రులు హర్షించరేమోనను సందేహమువలన అది చివరలో ప్రస్తావించగలదానను.

ఏతావతు ప్రస్తుతవిషయము ఈ పుట్టుట గిట్టుట మధ్యకాలమునకు పరిమితము చేసికొనవచ్చును.

మహాప్రభో, ఇప్పుడు అసలు విషయానికి వస్తాను. ఇక్కడ నాభాషను మన్నించవలసినది. ఈ విజ్ఞాపనపొడవునా ఇట్టి దోషములు కానవచ్చును. ఎందుకంటే ఇది గంభీరమైనవిషయము అయినను నాకు వచ్చిన భాషలో మాత్రమే నేను మనవి చేసుకోగలను. ఈవిషయమై పరమదయాళువైన తమరు పెద్దమనసు చేసి ఉపేక్షించగలరు.

నన్ను బాధించుచున్న తొలి అంశము

పనికిమాలిన ఉద్యోగముల పడవేసేవు,

పొనిచ్చగించని చోటులకి పంపేవు.

కోరని బండారములు నాముంగిట గుమ్మరించేవు.

కోరినదానికి ఒంటికాలిమీద పెయ్యేళ్ళు తపస్సు చేయమనేవు.

ఇది ఏమి న్యాయము? లేదా,

నేను చేసిన నేరమేమి?

రెండవ విషయము. దేశకాలపరిస్థితులవిషయమును ఇచ్చట ప్రస్తావింపక తప్పదు. దుష్టశిక్షణ శిష్టరక్షణకై తాము పేరుపేరు యుగములలో పేరు పేరు అవతారములు ధరించుచున్నారని తామే అర్జునునకు బోధించియుండిరి. ప్రధానముగా తమబోధనలననుసరించి దుష్టుచర్యలు మితి మీరినప్పుడు తాము అవతరించెదరని నాకు అవగతమయినది. ప్రస్తుతము దేశము కొందరి దుష్టచర్యలవలన అల్లకల్లోలమై యున్నది. ఘోరాతిఘోరములు జరుగుచున్నవి. ప్రజలు విహ్వలచిత్తులై దిక్కు దోచక అల్లల్లాడుచున్నారు. ఇంకా తమరు సంభవింపని కారణమేమి? జరుగుతున్న ఘోరాలు చాలవని తమ అభిప్రాయమా? నేను అలా అనుకోడంలేదు. నాలాటి కోటానుకోటి ప్రజలు అలా అనుకోడంలేదు. అందుచేత వెంటనే తమ సరికొత్త అవతారములో కనిపించి మమ్ముల రక్షింపవలె.

ఇంక గిట్టువిషయములో తమరిప్లాను తమకు గలదను జ్ఞానము తమరే ప్రసాదించిరి. తమఅభిప్రాయమును నేను అవశ్యము మన్నింపగలదానను. అయినను, నాబాధ నాది కనక ఈ మనవి తప్పదు. తమరు అనేక అవతారములు ఎత్తి, అవసరము తీరినవెనుక ఆయా అవతారములు చాలించినట్టే నాకును ఏర్పాటు చేయదగును. ఇది శ్మశానవిరక్తి కాదని మనవి. తమరివలె నాకు నేనై ఈ అవతారము ఎత్తకపోయినను, ఈఅవతారములో తమరు నాకు నియమించిన కర్తవ్యము సమర్థవంతముగా నిర్వహించితిననియే నమ్ముచున్నాను. అందుచేత నన్ను మరొక కార్యములో నియమించవలసినదిగా నా విజ్ఞప్తి. ఇది భూలోకముననే కావలసిపని లేదు. నేను ఏ లోకములోనైను సునాయాసముగా చక్కదిద్దుకుని కుదురుకోగలనని తమరికినీ యెరుకయే గదా.

ఇంతకీ నేను అడగబోయేది - ఈ దినము నాఇతరవ్యాపకములు మానుకొని సుదీర్ఘముగా ఆలోచించగా తోచినది - ఇంతకాలము నాకు మెప్పులు వలదని చెప్పికొనుచు వచ్చితి. ఇదియును తమబోధ కతముననే. మెప్పులు వలదనుట తప్పు, మెప్పులు దెప్పులు మరియు తిరస్కారములు ఏకరీతిని స్వీకరించుటయే వైరాగ్యమని తమబోధ. మరి తమరు అంతర్యామి కనుక సకలజనులకు ఇదియే బోధించిన, నాపని సుకరమగును కదా. అంటే మాపాఠకులందరూ దూషణభూషణతిరస్కారములు సమస్థాయిలో నాకు ప్రసాదించవలెనని విశదము చేయవలయును.

ఆఖరిమాట. నన్ను తయారు చేసినది తమరేనని తమదివ్యసమ్ముఖమునకు వినయపూర్వకముగా మనవి చేసికొనడమైనది. నాతలలో మరింత సారవంతమైన మట్టి పెట్టియున్నచో ఇంతకంటే సమర్థవంతముగా వాదించగలిగియుండెడిదానను. ప్రస్తుతము నాతలలో ఉన్నమట్టితో నాచేతనైనంత మేరకు ఈ విన్నపము సాగించితిని.

భగవాన్లుగారూ, తమరు నాబుర్రలో మరింత చురుకైన పదార్థము పెట్టినయనంతరము ఈ చిత్తుప్రతిని సంస్కరించి సకలసల్లక్షణ లక్షితయైన విజ్ఞాపనపత్రమును వినమ్రపూర్వకముగా తమ మణిమయఖచిత, సువర్ణమండిత దివ్యపాదారవింద సన్నిధికి దక్షిణతాంబూలములతో సమర్పించుకొనగలను.

ఇట్లు

భవదీయ

ఒకానొక అణుమాత్ర జీవి

తా.క. తిరుగుటపాలో జవాబు రాకపోతే మీఅమ్మతో చెప్తాను.

ooo

(ఆగస్టు 9, 2021)

## 18. ఎలుకని జయించేను (గల్పిక)

శాంతియుత సహజీవనము కథ కూడా.

రెండోఅంతస్తునించి మొదటి అంతస్తులోకి మారిపోయేక నాకు పట్టలేనంత ఆనందం కలిగింది.

మెట్లు ఎక్కిదిగే కర్మ తప్పింది కానీ మరోరకం వైపరీత్యాలు ఎదురవగలవనుకోలేదు.

మొదటిది – పైఅంతస్తులో వారు పిట్టలకోసం విసిరే గింజలు. అవి తినే పిట్టలు కనిపించలేదు కానీ ఆ గింజలు ఎత్తిపోసుకోడం నాపనయింది. నాపంచలోనే కాక, మొత్తం ఆవరణలో గచ్చు గింజలమయం. అవి ఎత్తిపోసుకోడం మామేనేజరు పనయింది. దాంతో ఆవిడ పైవారికి తాఖీదు ఇచ్చి, నాకు కూడా విముక్తి కలిగించింది.

రెండోది బొద్దింకలు. బహుశా బహువచనం తగదు. ఎందుకంటే నాకు కనిపించినవి మూడు అయినా అన్నీ ఒకే సమయంలో కనిపించలేదు. 2, 3 వారాలకి ఒకటి చొప్పున దర్శనమిచ్చేయి వంతులవారీగానేమో నాకు తెలీదు.

సరే, వాటిగురించి అంతర్జాలంలో వెతికితే కనిపించినసలహాల్లో ఒకటి నాకు నచ్చింది. ఉల్లిపాయముక్కలమీద baking soda చల్లి అది కనిపించినచోట పెట్టాలిట. దీన్లో తర్కం నాకు సరిగా అర్థం కాలేదు కానీ తేలిక గదా అని పెట్టేను ఓ చిన్నపళ్లెంలో.

మర్నాడు నాటీవీ ముందు ఓ బొద్దింక చచ్చి పడి ఉంది ఆఫ్ఘనిస్తానులో అల్లకల్లోలానికో నా ఉల్లిఘాటుకో తెలీదు మరి. దాన్ని తీసి పారేసేక ఆ ఘట్టం ముగిసింది.

ఈ రోజు patioవేపు గాజుతలుపూ, జల్లితలుపూ తీసి, వంటింట్లోకి వెళ్లేను మొక్కలకి నీళ్ళు తీసుకురావడానికి. మామూలుగా జల్లి తలుపు వేసేస్తాను కానీ ఎంతసేపులే అని వదిలేసేను. తిరిగి వచ్చేసరికి, హాల్లో టీవీముందు ఓ ఎలుక!

కెవ్్్్్్్్్్్

అరిపాదాల్లో రక్తం గుండెలకి ఎగదన్నింది.

ఇప్పుడేమి చేతునా అని ఒఖ్ఖక్షణం, ఒఖ్ఖటంటే ఒఖ్ఖటే క్షణం ఆలోచించి, మళ్ళీ అటు తిరిగి చూస్తే ఆ ఎలుక వీధిగుమ్మంవేపు పరిగెడుతోంది.

అది శుభసూచకం. వంటింట్లోకో పడగ్గదిలోకో అయితే మరీ కష్టం కదా.

అది వీధిగుమ్మంవేపు కొనసాగడంతో మాఇద్దరి అభిప్రాయాలూ ఒకటే అని తెలుస్తోంది.

ఎలుకకి నాఇంట ఉండడం ఇష్టంలేదు. నాక్కూడా అంతే.

ఇంక తలుపు తీసి వీడ్కోలు చెప్పడమే నావంతు. గబుక్కున కొండచీపురు అందుకుని, ఎలుకకి వీలయినంతదూరంలోను, తలుపుకి వీలయినంత దగ్గరగానూ ఒంగి, తలుపు నెమ్మదిగా తీసి, దయచేయమన్నాను ఎలుకతో.

అది తిరిగి చూడకుండా, శలవనైనా చెప్పకుండా పారిపోయింది.

బ్రతుకు జీవుడా అని నన్ను సముదాయించుకున్నాను.

సుదీర్ఘంగా నిట్టూర్చేను.

అంత తేలిగ్గా అయిపోయినందుకు ఆనందించేను.

నన్ను నేను అభినందించుకున్నాను కూడా.

ఆతరవాత మేనేజరు కనిపించినప్పుడు చెప్పేను "మాఇంట్లోకి rat వచ్చింద"ని.

ఆవిడ, "అది rat కాదు, mouse," అంది.

"ఏమో rat or mouse. Elephant అయినా నాకొద్దు. అసలు ఇప్పుడు జాతులూ, పదప్రయోగాలూ చర్చించు సమయము కాదు. నాకు వాటితో సహజీవనం చేసే సరదా లేదు అని తమరు గ్రహించవలెను. పోనీ, ఈ జీవులు అద్దె ఏమైనా సాయం చేస్తాయా అంటే అదీ లేదు కదా," అన్నాను.

000

ఈకథలో నీతి ఏమి? జాతినిర్ణయాలకీ, పదప్రయోగాల చర్చకీ సమయాసమయాలుంటాయి.

000

(ఆగస్ట్ 26, 2021)

## 19. గూడు లేనివాడు (కథ)

హేమీకి కోర్టువారినుండి తాఖీదు వచ్చింది.

ఫలానారోజున ఫలానా టైముకి స్థానికకోర్టులో హాజరు కావలసింది అని. లేదు. అతనేమీ నేరం చేయలేదు. అతను ఇచ్చుకున్న ఒక నేరారోపణవిషయంలో అతని సాక్ష్యం అవుసరం కనక కోర్టుకు వచ్చి సాక్ష్యం ఇవ్వవలసిందిగా ఆహ్వానం అది.

నేరారోపణ ఏమిటో చెప్పేముందు, అసలు అంతవరకూ జరిగిన కథ చెప్పాలి.

ఈ హేమీ అనబడువాడు ఉన్న మూడంతస్తుల మేడకి ఎదురుగా ఓ చిన్న ఇల్లుంది. అది పడగొట్టి మరో మేడ లేపే ఉద్దేశంతో ఆఇంటివారు ఆ ఇంటిని నేలమట్టం చేయనున్నారు. ఈలోపున గతిలేని దరిద్రులు ఇద్దరు ఆ ఇంట నివాసం ఏర్పరుచుకున్నారు. అది కంటకప్రాయమయింది పొరుగుమేడలో ఉన్నవారికి. వారు హేమీ ఉంటున్న మేడ మేనేజరుకి ఓ ఘాటయిన నోటిసు పంపించేరు.

ఆ నోటీసు వివరాలు ఇలా ఉన్నాయి.

— ఆ పడగొట్టబోయే చిన్నఇంటిలో ఉన్న దరిద్రులు (మేనేజరు వాళ్ళని squatters అంటాడు) అడ్డుగోడలు దూకి పొరుగుమేడ ప్రవేశిస్తున్నారు, వీధిలో పాదచారులవెంట బడుతున్నారు.

తమ పరిసరాలు పరిరక్షించుకోవలసిన బాధ్యత ఆప్రాంతంలో ఉన్న అందరికీ ఉంది కనక చుట్టుపక్కల నివసిస్తున్నవారు అందరూ తమ ప్రాంతాన్ని భద్రముగా ఉంచుకోడానికి సాయపడాలి కనక ఆ దరిద్రులను అరికట్టాలనీ, వారిని ఆ ఇంటినుండి బహిష్కరించాలనీ కోరుతూ స్థానిక అధికారులకు ఉత్తరములు  రాయవలసింది.

ఆ నోటీసులోనే రెండు పేర్లు సూచించబడ్డాయి కానీ అవి ఎవరివి? యింటియజమానులవో, నోటిసుకర్తలవో, ఆ దరిద్రులవో స్పష్టం చేయలేదు.

ఇహ అసలు విషయానికొస్తే, ప్రజాక్షేమము కోరేవాడూ సమాజసేవకి అంకితమైనవాడూ అయిన హేమీ ఆ నోటీసులో ఆదేశంప్రకారం స్థానిక అధికారులకు ఉత్తరం రాసేడు. ఈ ఉత్తరం ఇలా ఉంది –

— ఫలానావీధిలో కూలద్రోయనున్న ఇంటి యజమాని ఆఇంటిని కూలద్రోయక తాత్సారము చేయుటవలన ఆ ఇల్లు దిక్కులేనివారికి ఆశ్రమయి ఇరుగుపొరుగులకు ఇబ్బంది

కలిగించుచున్నది. ఆ ఇంట చేరిన ఖబ్జాదారులు గోడలు దూకి, మా వీధిన పోయే బాటసారుల వెంటబడి మాప్రాంతమున భయంకరపరిస్థితులు కల్పించుచున్నారు. ఏతత్కారణమున తమరు వారిని బహిష్కరించి, మాప్రాంతమునకు భద్రత పునఃప్రతిష్ఠించవలసినదిగా  ఇందుమూలముగా కోరడమైనది."

ఆ ఉత్తరం పోస్టు చేసి తనవిధి నిర్వర్తించినందుకు బహువిధాల ఆనందించేడు హేమీ.

అయితే అతను ఎదురు చూడని వాస్తవం స్థానికఅధికారులనుండి రాగల ఆహ్వానం. అతను అనుకోలేదు కానీ అది వచ్చింది, "మీఫిర్యాదు మాకు చేరినది. మేము దానిని కూలంకషముగా పరిశీలించినాము. దురాక్రమణదారులు ఆ నేరమును అంగీకరించలేదు. అందుచేత రెండు పార్టీలను సమావేశపరచి. మాతీర్పు చెప్ప నిశ్చయమైనది. ఫలానారోజున ఫలానా టైముకి హాజరు కావలసినది," అని ఆ ఉత్తరం ఆదేశం.

ఆ ఫలానారోజు హేమీమహాశయుడు కోర్టులో హాజరయేడు.

అతనిప్రాంతంలో అభద్రపరిస్థితులు కల్పించినట్టు నేరము ఆరోపించబడిన దురాక్రమణదారులు ఇద్దరూ హాజరయేరు. ఇక్కడ వారిని నిందితులుగా గుర్తించడమైనది.

నిందితులలో ఒకడైన మీకో తమకి వేరే న్యాయవాదులు లేరనీ, తానే ఇద్దరితరఫునా మాటాడతాననీ విన్నవించుకున్నాడు. జడ్జీగారు అందులో గల తికమకలు కొంత వివరించి, చివరికి అంగీకరించేరు.

ఇరు పార్టీలవారూ తమతమ వాదనలను ప్రతిపాదించేరు.

సాక్షులను ప్రశ్నించడం మొదలయింది. -మీకో ప్రశ్నలు, హేమీ సమాధానాలు ఇలా ఉన్నాయి.

"నేను  గోడ దూకుతుండగా నువ్వు చూసేవా?"

"నేను చూడలేదు"

"గోడ దూకుతూండగా చూసేవా?"

"లేదు."

"నేను వీధిలో ఎవరివెంట బడుతుండగా చూసేవు?"

"ఎవరివెంటబడడం చూడలేదు."

"నువ్వు మమ్మల్ని మొదటిసారిగా చూసేవు?"

"ఈరోజు ఇక్కడ మొదటిసారిగా చూస్తున్నాను."

"మరి నువ్వు ఎందుకు ఫిర్యాదు చేసేవు?"

"నాకు మామేనేజరు పంపిన నోటీసులో అలా ఉంది కనక."

"నువ్వు చూడనివిషయం చూసినట్టు సాక్ష్యం ఇచ్చుట నేరము అని నీకు తెలుసా?"

హేమీకి ఏమని జవాబివ్వలో తెలీలేదు.

"నీకు ఆ నోటీసు పంపినవారింట్లో ఏవస్తువులైనా పోవడం గానీ, ఎవరికైనా హాని కలగడం గానీ జరిగిందా?"

"నాకు తెలీదు."

మీకో జడ్జివేపు తిరిగి, "యువరానర్, ఈ సాక్ష్యం hearsay కనుక అంగీకారయోగ్యం కాదు. ఆకారణముగా కేసు కొట్టివేయవలసిందిగా కోరుచున్నాము," అన్నాడు.

కేసు కొట్టివేసేరు వాది నమ్మదగ్గ ఋజువులు చూపించని కారణముగా. అందరూ బయటికి నడిచేరు.

మిస్టర్ హేమేష్ మళ్లీ ఆ నిందితుడివేపు చూసేడు. ఎవరో పారేసిన కోటూ, అరిగిపోయిన చెప్పులూ, తుప్పజుత్తూ ఇతనికి న్యాయశాస్త్రంగురించి ఇంత ఎలా తెలిసింది అని ఆశ్చర్యం.

ఆమాటే అడిగేడు. "నువ్వు ఏం చదువుకున్నావు?"

"పదోక్లాసు. నువ్వేం చదివేవు?"

"హార్వర్డు లా స్కూల్."

"హఁ. Perry Mason చూసేను 5 సీజన్లు."

"నీకు ఇల్లు లేదు, ఎక్కడ చూసేవు టీవీ?"

"నేను ఈ కూలబోయే గోడలమధ్యే పుట్టేననుకున్నావా?"

హేమీకి ఆపైన ఏం అడగడానికీ తోచలేదు.

మీకో అన్నాడు, "నాకు ఇల్లు లేదు కానీ బుర్ర ఉంది. నీకు ఇల్లుంది కానీ బుర్ర లేదు."

000

చిన్న వివరణ: ఈకథలో ప్రస్తావించిన నోటీసు మేనేజరుద్వారా నాకు వచ్చినమాట నిజం. నేను మాత్రం దానిమీద ఏమీ చర్య తీసుకోలేదు. చెత్తబుట్ట దాఖలా చేసేను. కథలో ఉన్నాయి నాకారణాలు.

Pandemic కారణంగా ఓ మోస్తరు జరుగుబాటు గలవారు చాలామంది వీధిపాలయేరు.

ఈకథ రాయడానికి కారణం కొందరు ఇల్లులేనివారిగురించి ఎంత హేయమైన అభిప్రాయాలు  ఏర్పరుచుకుంటారో, వాటిని ఎలా ప్రచారం చేస్తారో చెప్పడానికే.

## 20. సంద్రాలూ ఎన్నెమ్మా సంవాదము (కథ)

సంద్రాలు- ఏటో ఈలగోల, సంపుకతినేస్తన్నరు.

ఎన్నెమ్మ – నీకూ తగిలిందీ ఆ గాలి?

సం. – నీకూ అంట దీర్గాలు తీస్తన్నవు, నీకూ తగిల్నాదా?

ఎ. – ఇంచుమించు అలాటిదేలే.

సం. – ఎవురో రచీత్తిరీ వస్తదన్నవు. వొచ్చినాదా?

ఎ. – ఆ వచ్చేరు, వెళ్లేరు. తల తిరిగిపోయింది.

సం. – ఏటయినాదేటి? నీకూ ఎట్టినాదా అరికత – నివ్వు సుకంగా నేవు, ఆమాట నీకే తెలవదు అంటా?

ఎ. – (నవ్వుతూ) మొదట్లో తెలీలేదులే. నీకు తెలుసు కదా నాకు ఏమాటైనా అర్థం చేసుకోడానికి కొంతసేపు పడుతుంది.

సం. – అసలేటయినాదో సెప్పరాదా?

ఎ. – తలుపు తీసి నేను వెనక్కి తిరిగి గదిలోకి నడుస్తున్నాను కదా. ఆ బోసీగది చూసి ఆమె ఏమనుకుని ఉంటుందో అని నాకు చాలాసేపటితరవాత అనిపించింది.

సం. – ఇల్లు కాలీ సేసీ పోయినాక ఉండేనాగ ఉంటాది మరి నీఇల్లు.

ఎ. – నీక్కూడా ఆసికంగానే ఉందేంటి నాఇల్లు. హుమ్.

సం. – అదిగాదు. నానిలాటి వోర్ని శానామందినే సూసిన. నేదులే. సెప్పు.

ఎ. – మంచినీళ్లతోనే మొదలయింది. అప్పట్లో నాకు తెలీదులే. ఇవన్నీ ఇప్పుడు తెలుస్తున్నాయి. రెండో బాటిలు మంచినీళ్లు ఇస్తుంటే ఎందుకండి ఒకటి చాలు అన్నారు.

సం. – అందులో తప్పేముంది. ఈరోజుల్ల నీల్లు జాగర్తగ కర్సు సేసుకోమంటన్నరు గద అందురూను.

ఎ. – మొదట నేనూ అలాగే అనుకున్నాను. కానీ చివరకి అర్థమయింది నేనంత ఖర్చు భరించలేనేమోనని, కేవలం నామీద జాలితోనే రెండోబాటిలు తీసుకోడానికి ఇష్టపడలేదని.

సం. – అద్సరే. రచీతలు కద. ఏం మాటాడుకున్నరు?

ఎ. – అదే నేనూ రచయితలం కద, కథలగురించీ, సాహిత్యంగురించీ మాట్లాడతారని అనుకున్నా. తీరా చూస్తే ఆవిడ అసలు వచ్చిందే వేరే పథకంతో. ఓ బుట్టనిండా తనపుస్తకాలన్నీ తీసుకొచ్చేరు.

సం. – మరి నివ్వు సానామందినే సూసేవు గద దేశం వెల్లి సానామందితో మాటాడినానని సెప్పేవు. ఏం మాటాడినావు?

ఎ. – నేను ఎప్పుడూ నాకథలు చదివేరా అని అడగలేదు. అప్పటికింకా పుస్తకాలేవీ ప్రచురణ కాలేదు. అంచేత నాపుస్తకాలు ఇచ్చే ప్రసక్తే లేదు.

సం. – సరి. ఈయమ్మ తెచ్చినాదంటావు.

ఎ. – అది కాదు. ఈరోజుల్లో అందరూ చేస్తున్నారు. ఎటొచ్చీ వెనకొకసారి ఆమె చేసిన ఇంటర్వ్యూలోనే చెప్పేను నేను ఈకాలం వస్తున్న పుస్తకాలు చదవడంలేదనీ, నాకు వాటిలో ఆసక్తి లేదనీ. పైగా ఆ స్త్రీవాదాలూ అవీ నాకు ఇష్టంలేదని కూడా చెప్పేను.

సం. – నివ్ సెప్పేవులే. ఆరు మాత్తరం – ఎవరికి వారే – తాము ఏరనుకుంతరు.

ఎ. – మరోటి కూడా ఉందిలే. నాకతలు అమెపత్రికలో అచ్చేస్తున్నారు కదా. ఆ అప్పు తీర్చుకోవాలని కూడా కావచ్చు.

సం. – అంతెమరి. ఆరిఈపు ఈరూ ఈరిఈపు ఆరూ గోక్కోడమే గద ఇప్పుడు ధరమమూ, నీతీను. అది నేకపోతె రచీతగా బతుకు నేదు.

ఎ. – ఇంతకీ నాకు మనసు చివుక్కుమన్నది ఎప్పుడంటే …

సం. – ఎప్పుడు?

ఎ. – నేను అమాయకంగానే తలొంచుకుని నిదానంగా నాకో పురస్కారం వచ్చిందన్నాను.

సం. – ఏమి పురస్కారం అని ఆమె అడిగింది.

ఎ. – అలా అడగడంలో తప్పు లేదు కానీ ఆ తరవాతే నాకు షాకు. నేను జవాబు చెప్పకముందే ఏదో చిన్నదైతేనేమీ పెద్దదయితేనేమీ పురస్కారమే అంది.

సం. – సెప్పకముందే? అంటే ఆమెకి తెలుసన్న మాటే గద.

ఎ. – పైగా చిన్నదో … అంటే తక్కువ చేసి మాట్లాడ్డమే కదా.

సం. – కాద మరి. ఆమెకి పదో ఇరవయ్యో ఉన్నయి. సొంతంగా ఎట్టుకున్నయి ఇంకాఎన్నో.

ఎ. – పోదూ, నువ్వు మరీను. సొంతంగా ఎవరు పెట్టుకుంటారు?

సం. – ఇందుకే నీకేటీ తెల్దు అంటన్న. సెప్పేను గంద ఎల్లమ్మతోటకాడ వోలిండియ(ఆలిండియా) రేడియోనాగే. అక్కడ సెప్పుకోని ఇసయం నేదు.

ఎ. అసలు నేనెవర్నీ ఇంటికి రానీను. ఈమెని రానియ్యడమే నా తప్పు.

సం. మరేల రానిచ్చినవ్ ఈమెగారిని?

ఎ. – అంటే రెండేళ్లగా నారచనలు సీరియలుగా వేస్తున్నారు. ఏవో మెయిళ్లు ఇచ్చుకున్నాం గానీ ఎప్పుడూ నావొంత విషయాలు అడగలేదు. ఇంటర్వ్యూలో కూడా అడగలేదు. అంచేత సాహిత్యం మాత్రమే మాట్టాడతారు అనుకున్నాను.

సం. – అదే మరి. ఎవురెలాటి ఓరో తెలీటానికి ఒకరకం ప్రత్తేకమైన అనుబవాలు కావాల. అయి ఎప్పుడు ఎనాగ వస్తయో సెప్పనేం.

ఎ. – ఇంతకీ గంపెడు పుస్తకాలు తెచ్చేరన్నా నా. నాకేమో ఉపయోగంలేని వస్తువులు, పుస్తకాలయినా సరే, ఇంట్లో పెట్టుకోడం ఇష్టం ఉండదు. అంచేత వద్దన్నాను. మరీ మొహమాటపెడితే ఒక్కటి తీసుకున్నాను. అది తీసి చూసేక తెలిసింది. ఆవిడ ఆ గుంపులో మనిషే, తెలీనట్టు నటన అని.

సం. – గుంపేటి? ఎవురిమాట నివ్వంటన్నది?

ఎ. – ఆ అతి చిన్న పురస్కారం ఇచ్చినవారిగుంపు.

సం. – అయ్యోరామా. నివ్వే అనుకున్న. ఆ యమ్మ గూడా అంతే (నవ్వుతూ)

ఎ. – అంతే అంటావేమిటి అదెలా?

సం. – నీకు తెలిసిపోతాదని ఆయమ్మకి తెలీనే లేదనీ(ఇంకా గట్టిగా నవ్వుతూ)

ఎ. – నేనూ ఎంతోమందిని రచయితలనీ, పత్రికాసంపాదకులనీ కలిసేను. ఒక్కరిదగ్గర కూడా కనీసం నాకథలు చదివేరా అని అడగనైనా అడగలేదు.

సం. – మరేటి మాటాడేవు?

ఎ. – వాళ్లని కలవడానికి నేను వెళ్లేను. అంచేత వాళ్లరచనలూ, వాళ్ల అభిప్రాయాలు ఈనాటి సాహిత్యంగురించి అడిగేనంతే. ఈకథకి ఈశీర్షిక ఎలా నప్పుతుంది, ఆకథలో మీరు ఆపాత్రని సృష్టించడానికి స్ఫూర్తి ఏమిటి ఇలా. అంతే గానీ,

సం. – ఆయమ్మ ఏమడిగినాది?

ఎ. – మీపిల్ల మరో ఉద్యోగం చేస్తోందా?

సం. – సెప్పనేకపోనావా పిల్లకి అదొక్కటే ఉద్దోగం, దాంతోనే ఇల్లు కూడా కొన్నాదని.

ఎ. – అదే అన్నాను. అసలు నాసందేహం కూడా అదే. ఈ స్త్రీవాదులూ, మరో వాదులూ అందరూ గోలెట్టేది ఆడవాళ్లకి తగినగౌరవం ఇవ్వడంలేదూ, స్వేచ్ఛలేదూ, అంటూ

అంకమ్మసివాలు. అసలు వీళ్లే మనిషిని మనిషిగా గౌరవించరేమీ అని. అంత గొప్ప స్త్రీవాదీ నేను రచయిత్రిని, తానూ రచయిత్రి, ఆ గౌరవం నాకు ఇవ్వలేదు. తాను నిలుపుకోలేదు.

సం. – అదే గద. నాను ఇందాకా వస్తానే అంటిని ఒకటే గోల అని. ఇదే నానన్నది గూడా. నాకేటి గావాలో నాకు తెల్దంటరు. నాను సుకంగ లేనంటరు, దొరబాబు నాకాయకస్టం దోచేసుకుంటన్నడు అంటరు. మరి ఆరు సేసే ఉద్దోగాలు మాతరం కూలిపన్లు గావా? ఆరు మాతరం కూలికి గాదా పని సేసేది?

ఎ.- కూలికీ, పేరుకీను. వాళ్లు చేసేది గౌరవప్రదం. నువ్వూ నేనూ చేసేది నికృష్టం. నాది అద్దెకొంప. నాఇంట్లో కుర్చీలు బల్లలూ Maceyలో కొన్నవి కావు. నేను తొడుక్కున్న బట్టలు ఫేషను కాదు.

సం. – అదే నీకు సాలని ఆల్లకి అర్తం కాదు. నీకు అదే ఇస్టమని అర్తం కాదు. ఎందుకంటె ఆరికల్లు ఆకాసంలో ఉంటయి. ఆరికి నేలమీద ఉండే నివ్వూ నేనూ కంటికనము. సరిలె. పొద్దోయింది. నాసెల్లాల.

ఎ. – అదేమిటి పుస్తకం తీసుకెళ్తున్నావు, ఎందుకూ? చదువుతావా? దొరబాబుకిస్తావా మనవాళ్ల మేధ ఇలా ఉందని చెప్పడానికి?

సం. – ఇందులకే మాయప్ప అంటాది ఈ వోదాలన్ని ఆల్లలో ఆల్లు కుమ్ముకు సవ్వటానికే. అల్లకి అదో కాలచ్చేపం, ఇనోదం. ఆ వోదాలవల్ల మనలాటోల్లకి ఒరిగేదేమీ నేదని.

000

సూత్రధారి:

సంద్రాలు మౌనముగా సింహద్వారమువైపు నడిచెను.

ఎన్నెమ్మ లాపుటాపు ఒడిలో పెట్టుకుని అంతర్జాలములో ఓలలాడుచుండెను.

మరుక్షణము  దబ్బుమని ఒక వస్తువు చెత్తబుట్టలో పడినశబ్దము వినిపించెను.

ఎన్నెమ్మ తలెత్తకనే, అటు చూడకనే తనపనిలో ఉండెను.

అటుపిమ్మట సకల జనులును ఎవరిపద్ధతిని వారు సుఖులై శాంతమనస్కులై శేషజీవితమును గడుపుకొనిరి.

000

(సెప్టెంబరు 15, 2022)

# 21. పెద్దతనం (కథ)

ఎవరో తట్టిలేపినట్టు ఉలిక్కిపడి కళ్లు తెరిచి చుట్టూ చూసింది కాంచన. ఎదురుగా బల్లమీద వాచీ పదకొండు దాటి పావుగంట అయిందంటోంది. అబ్బ! ఇంత వెలుగేమిటి? అనుకుంటూ

మళ్లీ చుట్టూ చూసింది. రెండు నిముషాలు పట్టింది ఇది పగలే అని అర్థమవడానికి. కిటికీలకి కట్టినతెరల నీలిరంగు వెలవెలా బోతోంది ఆవెనకనున్న వెలుగుతో.

తెల్లారుతూనే అలవాటుప్రకారం నాలుగ్గంటలకి లేచి, రెండు కప్పులు కాఫీ తాగి, ఈమెయిళ్లు చూసుకుంది. ఇంకా మత్తుగానే వుంది. అసలు దేశంనుంచి తిరిగొచ్చినదగ్గర్నుంచీ ఏం బాగుండడంలేదు.  లాప్టాప్ కుక్కపిల్లలా ఒళ్లో పొదువుకుని అదేపనిగా రాసేసుకు పోతుంటే, దానివేడికి ఒళ్లు ఆర్చుకుపోతోంది. దానికి తోడు చిక్కటి కషాయంలాటి కాఫీలు మూడు కప్పులు తాగి తెచ్చుకున్న పైత్యం. .. దాంతో దగ్గూ ..

పోనీ, కెఫీను కాస్త తగ్గించి చూదాం అని ఈరోజు డికాఫ్ తాగితే, కాఫీ తాగినట్టు లేదు. కప్పు కడిగిననీళ్లు తాగినట్టుంది కానీ… ఒళ్లో వున్న లాప్టాప్ ఎదురుగావున్న కాఫీబల్లమీద పెట్టి వెనక్కి వాలింది కాంచన.

దేశంలో వున్నన్నాళ్లూ బాగానే అనిపించింది. వెళ్లిన ప్రతిచోటా, కనపడిన ప్రతివారూ "పెద్దవారు, అమ్మగారు, మేడమ్" అంటుంటే అప్పటికి బాగానే వుంది కానీ ఇంటికొచ్చేక పదే పదే అదేమాట మనసులో మెదిలి, నువ్వు పెద్దదాని అయిపోయేవు అని ఎవరో రెండుచెవుల్లోనూ బాకాలెట్టుకుని మరీ హోరు పెడుతున్నారు!

ఇంతవరకూ "మీరింత పెద్దవారనుకోలేదు" "you don't look that old" అన్నమాటే వుంటూ వచ్చింది మరి. సినిమాకెళ్తే, నువ్వు సీనియర్ సిటిజన్వా అని మరోసారి అడుగుతారు డిస్కౌంటివ్వడానికి.

"హుమ్. వీళ్లందరూ కలిసి నాకు లేనిఆలోచన నాబుర్రలో పెట్టేశారు అదేదో నల్లమేకా, నలుగురు దొంగలు కథలోలాగ," అనుకుంది కాంచన నోరు కుక్కమూతిపింజెలా పెట్టి. లేదా, "నాకు దిష్టి తగిలివుండాలి" అని కూడా అనుకుంది. పెదాలు చిలిపిగా విచ్చుకున్నాయి.

ooo

తను విశాఖపట్నం వచ్చేనని తెలియగానే ఒరిస్సాలో వున్న ప్రమీల రెక్కలు కట్టుకు వాలింది, కూతుర్ని చూడాలన్న వంకతో. కాలేజీలో వున్న నాలుగేళ్లు కవలల్లా కలిసి తిరిగేవారు. రోజూ క్లాసులయేక, సాయంత్రం తనింటికి వచ్చేసేది. ఇద్దరూ డాబామీద కూర్చునేవారు పుస్తకాలు ముందేసుకుని. ఏంమాటాడకపోయినా ఏదో హాయి. మనసునిండా నింపుకుని. ప్రమీలది కమ్మని కంఠం. చక్కగా గొంతెత్తి "రావోయి చందమామా" అనో "లాహిరి లాహిరి లాహిరిలో ఓహో జగమే" అనో పాడుతుంటే తను వింటూ … అలా ఎంతసేపో. కిందనించి అమ్మ అన్నాలకి రమ్మని పిలిచేదాకా టైము తెలిసేదే కాదు.

"అబ్బ, నువ్వలాగే వున్నావే .. ఏం మారలేదే," అని ప్రమీల అంటుంటే, కాంచనకి నవ్వొచ్చింది.

"మారని రూపాయిని" అంది కాంచన చిలిపిగా కళ్లు చిట్లించి.

"పోదూ, నువ్వు మరీనూ.. హాయిగా అమెరికాలో స్థిరపడిపోయేవు. గొప్పరచయిత్రివయిపోయేవు. నీకు గుర్తున్నారా, కామేశ్వరీ, అహల్యా .. మేం నీపేరు పత్రికలో కనిపించినప్పుడల్లా ఎంతో మురిసిపోతాం."

"నువ్వూ ఏం మారలేదు" అంటూ కాంచన ప్రమీలవేపు చూసింది. నిజానికి ప్రమీల బాగానే ఒళ్లు చేసింది. మాటలు సాగదీస్తూ నెమ్మదిగా పలుకుతోంది. కాస్త ఆయాసం కూడా. ఎందుకో తనకంటే పదేళ్లు పెద్దదానిలా అనిపించింది. మాటతీరూ, మనిషితీరూ కూడా బాగానే మారింది.

"నీకేం హాయిగా ఒక్క పిల్లతో సరిపుచ్చుకున్నావు. నాకు ముగ్గురాడపిల్లలు. తరవాత ఇద్దరు మగపిల్లలు. మాఅత్తగారికి మగపిల్లాడు లేకపోతే వంశం ఏమైపోతుందోనని బెంగ. ఆతరవాతివాడు అనుకోలేదులే. … "

కాంచనకి ఏం చెప్పాలో తోచలేదు.

"నీఆరోగ్యం బాగానే వుందా?" అడిగింది ప్రమీలే మళ్లీ.

"బాగుంది. నాకున్నదదొక్కొటే." అంది కాంచన వెల్తి నవ్వుతో.

"అదే మహద్భాగ్యం. నీకు తెలుసు కదా. అప్పట్లో నాకు 19ఏళ్లు. పెళ్లి చేసేశారు. వరసగా పిల్లలూ. తెల్లారి నాలుగ్గంటలకి లేస్తే, రాత్రి పదకొండుకి పడక. ఇంట్లో పనులన్నీ నేనే చూసుకోవాలి. నేను లేకపోతే ఒక్కక్షణం జరగదు మావారికి. ఆయనే కాదు మామామగారు కూడా , అమ్మాయీ నా కలం కనిపించలేదు చూడూ, కాగితాలు కాస్త చూసి పెడుదూ, అంటూ .. కాపురానికొచ్చేక

పుట్టింటికి వెళ్లలేదు తెలుసా. నువ్వు లేకపోతే ఇల్లు ఎలా నడుస్తుంది అనేవారు మాఅత్తగారు కూడాను. పిల్లలబట్టలన్నీ నేనే కుట్టేను. ఆవకాయ పెట్టాలంటే కాయలు తెప్పించడం, కారాలూ, ఆవపిండి కొట్టించడం అన్నీ నేనే చూసుకోవాలి. మాఅత్తగారికి ఏమీ తెలీదు. మరి ఆవిడెలా చేసేరో కాపురం," ప్రమీల నవ్వుతూ చెప్తూంటే కాంచన చూస్తూ కూర్చుంది.

ప్రమీల సమర్థవంతంగా ఇల్లు నిర్వహించేనని గర్వపడుతోంది. తను సంతోషించాలి. కానీ మనసులో ఏదో వెల్తి. తామిద్దరిమధ్యా ఎడం ఎంతో … మరోసారి ప్రమీలవేపు చూసింది.

మోకాళ్లు ఆపరేషను చేయించుకుందిట. రోజూ గంటసేపు ఎక్సర్సైజు చెయ్యాలి. ఆమధ్య గుండెల్లో చిన్న నొప్పిలాటిది వచ్చింది కానీ సమయానికి మూడోకూతురు డాక్టరుదగ్గరికి తీసికెళ్లింది. ఇప్పుడు నయంగానే వుంది. పిల్లలు చక్కగా చూసుకుంటున్నారు. ఒకొకరిదగ్గర రెండేసి నెలలుంటుందిట. .

"ఆడది ఇంటికి మూలస్థంభంలాటిది. మంచికీ చెడుకీ నిలదొక్కుకుని, సంసారం చక్కదిద్దుతూ, పిల్లల్ని వృద్ధిలోకి తీసుకురాగల ధైర్యస్థైర్యాలు ఒక్క ఆడదానికే వుంటాయి," అంది ప్రమీల ఆయాసపడుతూ.

తల్లిని తీసుకొచ్చిన మూడోకూతురు, రజని, "పదమ్మా, ఆలస్యం అవుతోంది. వేళకి తిని పడుకోపోతే మళ్లీ రేపు లేవలేవు" అని, "వస్తామండీ" అంది కాంచనవేపు తిరిగి.

"వుంటావా నాలుగురోజులు?"

"లేదు. పెద్దమ్మాయిదగ్గర వుంటున్నాను కదా. ఈనెలాఖరువరకూ అక్కడే వుంటాను. వచ్చేనెల అబ్బాయిదగ్గరికి వెళ్తాను."

000

కాంచన నిట్టూర్చింది. ఎక్కడికి వెళ్లినా, ఎవరు కనిపించినా అదే ధోరణి. ఇరుగింటా, పొరుగింటా, బజారులో, సభల్లో, సన్నివేశాల్లో – మేడమ్, అమ్మగారు, అమ్మమ్మగారు, … తనకిచ్చే గౌరవవాచకాలు. ఆసంబోధనలలో మనసంస్కృతి గుర్తొచ్చి మనసు మృదువుగా స్పందించింది. వెనక ఎవరో బామ్మగారంటే తనని అలా అనొద్దని చెప్పినమాట గుర్తొచ్చింది.

హాల్లో కూర్చుని ఆరోజు పేపరు చూస్తున్న కాంచనకి గుమ్మందగ్గర ఎవరో నిలిచినట్టనిపించి తలెత్తి చూసింది.

రజని “పన్లో వున్నారా? వేరే పనిమీద ఇటొచ్చి, మీరేం చేస్తున్నారో అని ఆగేనిక్కడ” అంది.

కాంచన పేపరు మడిచి పక్కన పెడుతూ, “లేదు, పనేంలేదు. రా.” అంటూ ఆహ్వానించింది సాదరంగా.

రజని లోపలికొచ్చి కాస్త ఎడంగా కుర్చీ లాక్కుని కూర్చుంది.

“మీఅమ్మ వెళ్లిపోయిందా?”

“ఆఁ, నిన్నరాత్రి రైలెక్కించేను. మీరంటే మాఅమ్మకి చాలా ఇష్టం. మొన్న మీరు వెళ్లిపోయింతరవాత రోజంతా మీగురించే చెప్తూనే వుండింది,” అంది రజని కళ్లనిండా అభిమానం నింపుకుని.

కాంచన చిన్నగా నవ్వింది, “అవును, ఆరోజుల్లో ఇద్దరం చాలా స్నేహంగా వుండేవాళ్లం, ఏ అరమరికలూ లేవు. మళ్లీ ఆరోజులు రావు,” అంది. ఆతలపు రవంత నిస్పృహ కలిగించి, మొహంలో కళ తప్పింది.

ఇద్దరికీ క్షణకాలం మాట తోచలేదు. కాంచన చిన్నగా నవ్వి, “మా అమ్మ కూడా ఇలాగే ..” అంది.

“అంటే?”

“అదే, ఇలా మాటా పలుకూ లేకుండా కూర్చునేవాళ్లం ఇద్దరం గంటలతరబడి డాబామీద. మాకెందుకో అలా ఏమాటా లేకపోయినా ఏం వెలితుండేది కాదు,” అని “రా, డాబా చూపిస్తాను” అంటూ లేచింది.

ఇద్దరూ డాబామీదికెళ్లేరు. పిట్టగోడమీదికి వాలినకొమ్మలతో, విరగబూసిన సంపెంగచెట్టూ, చుట్టుగోడకి దగ్గరగా గుత్తులు గుత్తులుగా గంగాబోడాలతో, పింజలతో, సుతారంగా వాలిన మట్టలతో కొబ్బరిచెట్లూ, పెరటిమధ్యలో దానిమ్మచెట్టూ, పారిజాతం చెట్టూ, దూరంగా మహోధృతంగా ఎగసిపడుతున్న అలలతో దిగంతాలకి పరుచుకున్న సముద్రమూ, ఏరాడకొండమీద లైట్ హౌసూ… కాంచనకి పాతజ్ఞాపకాలు ముసిగుకొస్తుంటే, రజనికి కొత్త తలపులు రూపు దిద్దుకుంటున్నాయి.

“మేం ఇద్దరం ఇక్కడ చాప పరుచుకు పడుకుని, ఇరవై సెకనులకొకసారి గోడమీద వెలిగే లైట్హౌస్ కిరణాలు ఎన్నిసార్లు లెక్కపెట్టేమో .. ఇప్పుడు తలుచుకుంటే సిల్లీగా వుంటుంది …” అంది కాంచన దూరతీరాల్లోకి చూస్తూ.

“మాఅమ్మకీ మీకూ కూడా ఇలాటి సాయంత్రాలు మాటల్లేకుండా గడిచేయంటే నాకు ఇప్పుడు అర్థం అవుతోంది,” అంటుంటే రజనికళ్లలో రవంత ఈర్ష్యఛాయలు తోచేయి కాంచనకి. ఆవిడ చిన్నగా నవ్వుకుంది ఈకాలపుపిల్లలు అనుకుంటూ.

మరోపావుగంట వుండి, “ఆదివారం మాయింటికి లంచికి రండి,” అంది రజని కాంచనవేపు తిరిగి.

“లంచికా?” కాంచనకి ఆశ్చర్యంగా అనిపించింది. వాళ్లమ్మ ఉన్నప్పుడు పిలవలేదు. ఇప్పుడిదేమిటి?

“మీకు వేరే పనుంటే మరోరోజు చూద్దాంలెండి. మీరింకా ఎన్నాళ్లుంటారిక్కడ?”

“లేదులే. ఆదివారం వస్తాను. ఎన్నాళ్లో లేదు. సోమవారం వెళ్లిపోతున్నాను.”

“కారు పంపిస్తాను. లేకపోతే నేనే వస్తాను” అని గుమ్మందాకా వచ్చి, “మిమ్మల్ని ఏమని పిలవమంటారు. మొన్న మాఅమ్మతో వచ్చినప్పుడు, మీకు ఆంటీ అంటే ఇష్టంలేదన్నారు కదా” అంది రజని చిరునవ్వు కళ్లలో మెరుస్తుండగా.

కాంచన కూడా నవ్వింది, “నీఇష్టం.”

రజని వెళ్లిపోయేక, చాలాసేపు కాంచన ఆలోచిస్తూనే వుంది తనని ఏమని పిలవడం? “ఏమే కాంచనా” అంటూ నోరారా పిలిచింది ప్రమీల ఒక్కర్తే. మిగిలినవారందరికీ అయితే మేడమ్, అమ్మగారు, అమ్మమ్మగారు. .. కదాచితుగా డాక్టర్ కాంచన, ప్రొఫెసర్ కాంచన … నాకపేవీ లేవని చెప్పేసరికి ప్రాణం సాలుకొచ్చింది.

000

ఆదివారం పదిగంటలకి రజని ఫోన్ చేసింది, “బసంతో ఏదో పనిమీద కారు తీసుకువెళ్లేడనీ, పదకొండున్నరకి తనింటికొచ్చి వాళ్లింటికి తీసుకెళ్తాడని.

సరేనంది కాంచన.

రజని యమ్మెస్సీ బయాలజీ చేసేక, వుద్యోగరీత్యా కలకత్తాలో వుండగా బసంతో చటర్జీతో పరిచయం అయింది. పెళ్లయి పదిహేనేళ్లయింది. ఇద్దరు పిల్లలు. విశాఖపట్నానికి మారి రెండేళ్లయింది.

అన్నట్టుగానే బసంతో పదకొండున్నరకల్లా వచ్చేడు. తొందరగానే వచ్చేస్తానని ఇంట్లో తమ్ముడికీ మరదలికీ చెప్పి కాంచన కారెక్కింది.

ఇల్లు చూడముచ్చటగా వుంది. మూడుగదుల ఫ్లాటు. చక్కగా అమర్చేరు. హాల్లో సోఫాసెట్టూ, గోడలమీద బాపిరాజుగారి చిత్రాలూ, వంటగదికి ఎదురుగా రోజ్వుడ్ భోజనాలబల్లా వారి స్తోమతు తెలియజేస్తున్నాయి. ఆరేళ్ల అమ్మాయీ, పదేళ్ల అబ్బాయీ నీటుగా వున్నారు. తెలుగుదేశం వచ్చి రెండేళ్లయినా బెంగాలీ మర్చిపోలేదు. చక్కగా బెంగాలీ, ఇంగ్లీషూ కూడా మాటాడుతున్నారు. తెలుగు కూడా నాలుగుముక్కలు వల్లిస్తున్నారు.

"ఇంగ్లీషుమీడియంస్కూల్లో వేసేం. తెలుగు నేర్పాలని నాకయితే వుంది కానీ ఎక్కడ .. ఏపనికీ తీరికుండదు నావుద్యోగం. ఆయన వుద్యోగం ..." రజని అంటుంటే కాంచన అడ్డు పడింది.

"బెంగాలీ వాళ్లనాన్న భాష అని నేర్పేవు. బతుకుతెరువుకి అని ఇంగ్లీషు నేర్పేవు. తల్లిభాష తెలుగు మాత్రం నేర్పడానికి టైము లేదంటున్నావు" అంది చిన్నగా నవ్వుతూ.

"లేదండీ. నాకయితే నేర్పాలనే వుంది. చెప్పేను కదా. ముందు నాకు వస్తే కదా. నాచిన్నతనం భువనేశ్వర్లో గడిచింది కనక నాకూ తెలుగు అట్టే ఒంటబట్టలేదు. ఏదో మాఅమ్మవెనక తిరుగుతూ నాలుగు ముక్కలు మాట్లాడ్డం వచ్చింది కానీ చదవడం, రాయడం రాదు."

రజని కాంచనతో మాటాడుతుంటే. బసంతో వచ్చి అప్పడాలు వేయించనా అనడిగేడు. రజని తలూపి, తను కూడా లేచింది కంచాలు పెట్టడానికి. అబ్బాయి హరీష్ మంచినీళ్లు పెడుతుంటే, కాంచనకి ఎదురుగా ఒదిగి కూర్చుంది రుమ.

"కాయితం, కలం తీసుకురా. నీపేరు తెలుగులో రాయడం నేర్పుతాను" అంది కాంచన రుమతో.

రుమ హుషారుగా లేచి వెళ్లి కాగితం తీసుకొచ్చింది.

కాంచన "a circle, a check on top, a hook to the right" అని వర్ణిస్తూ అక్షరాలు రాస్తూంటే రజని భోజనాలబల్లమీద కంచాలూ, గిన్నెలూ అమరుస్తూ ఓరకంట వాళ్లని చూస్తోంది మురిపెంగా.

కాంచన రాయడం పూర్తవగానే, రుమ ఆ అక్షరాలవేపు చూసి, “అవి నావేపునించా, నీవేపునించా?” అనడిగింది.

కాంచన “నీవేపునించే” అని చెప్పి, “చురుకుపాలు ఎక్కువే” అంది రజనితో. రజని నవ్వింది సంతృప్తిగా.

రుమ తనపేరు తేలిగ్గానే రాసేసి, అన్నపేరూ, అమ్మపేరూ, నాన్నపేరూ కూడా రాయమంది.

రజని, “రండి. తినడం అయినతరవాత మిగతా పాఠం,” అంది.

కాంచన మరోమారు రుమని మెచ్చుకుని, భోజనానికి లేచింది.

కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తుంటే. కాంచన “నాకు బెంగాలీ చెప్పు. నీపేరేమిటి అని ఎలా అడుగుతారు?” అనడిగింది రుమని..

రుమ చెప్పింది కానీ కాంచనకి ఆవాక్యం పట్టుబడలేదు. మూడు చుట్లయేక, “I will tell you yes and no” అంది.

కాంచనకి నవ్వొచ్చింది.

బసంతో, “You are down to LKG,” అన్నాడు నవ్వుతూ.

అందరం నవ్వుకున్నాం. భోజనాలయేక, రజనీ, కాంచనా హాల్లోకి వచ్చి కూర్చున్నారు. బసంతో, పిల్లలూ, బల్లమీదున్న కంచాలూ, గ్లాసులూ ఎత్తిపెడుతుంటే, కాంచనకి ముచ్చటేసింది. రజనివేపు చూసింది ఏ అమ్మాయి మాత్రం ఇంతకంటే ఏం కోరుకుంటుంది అనిపిస్తోంది వాళ్లని చూస్తుంటే.

“మీరేమైనా షాపింగ్ చేస్తారా?” అనడిగింది రజని.

“లేదులే. నాషాపింగంతా హైదరాబాదులో అయిపోయింది. మీరు వెళ్లండి. నేనింటికెళ్తాను.”

“లేదండీ, నాకేం పనిలేదు. బసంతో వాళ్లిద్దర్నీ టెన్నిస్ ప్రాక్టీసుకి తీసుకెళ్తాడు. మనం కైలాసగిరికి వెళ్దాం మీకు ఫరవాలేదంటే. చాలా బాగుంటుంది” అంది రజని.

తండ్రినీ పిల్లల్నీ టెన్నిస్ కోర్టులో దింపేసి, రజని కాంచనతో కైలాసగిరివేపు సాగింది.

దారిలో కాంచనకి చాలా విషయాలు తెలిశాయి. "నేను ఏం సాధించాలనుకున్నానో నాకిప్పుడు అర్థం కావడంలేదు. బయాలజీ చదువుతున్నరోజుల్లో రిసెర్చ్ చేసి లోకంలో రోగాలన్నిటికీ కారణాలు కనిపెట్టేసి మందులు కనిపెట్టేసి, బాధలన్నీ తీర్చేయాలనుకునేదాన్ని. రిసెర్చ్ సాగలేదు. బసంతోతో స్నేహం, పెళ్లీ, అతనిఉద్యోగంలో అవకతవకలూ, పిల్లలూ, మధ్యలో ఒక మిస్కేరేజీ .. ఎప్పటికప్పుడు ఏదో ఒక అనుకోని అవాంతరం. .. నా పిహెచ్డీకి. నేను ఎవర్నో తప్పు పడుతున్నానని కాదు. బసంతో సహకారంలో లోపం లేదు. పిల్లలు పుట్టేరంటే దానికి వాళ్ళని తప్పుపట్టలేం కదా.. " అంది రజని చిన్నగా నవ్వి.

కాంచనకి ఏమనాలో తోచలేదు.

"అమ్మ మాకోసం ఎంత త్యాగం చేసిందో చూడండి. ఏపూటకాపూట భోజనం దగ్గర్నుంచీ, పుస్తకాలూ, బట్టలూ, చదువులూ అంతా తనే చూసుకుంది. క్షణం విరామం లేకుండా మాకందరికీ సేవలు చేసింది. మాకు బాగా జ్ఞానం వచ్చి మేమే వెళ్లు, వెళ్లంటూ తోలేవరకూ పుట్టింటికి కూడా వెళ్లలేదు. మానాన్నగారు ఉన్నారన్నమాటే కానీ అసలు మేం ఇంట్లో వున్నామో లేమో కూడా స్పృహ వుండేది కాదాయనకి. అసలు మేం ఆయనపిల్లలన్న స్పృహ కూడా వుందో లేదో అనుమానమే. ఆయన ఫైళ్లే ఆయనలోకం. ఖర్మం చాలక అమ్మ ఎప్పుడయినా ఓమాట అడిగినా, అవన్నీ తల్లి చూసుకోవాలి. అది నీకర్తవ్యం అనేవారు."

ఈపిల్ల ఇవన్నీ తనకి ఇప్పుడు ఎందుకు చెప్తోందో కాంచనకి అర్థం కాలేదు.

"అప్పట్లో నాకు మహ చిరాకేసేది కానీ ఇప్పుడు అర్థం అవుతోంది కొంతయినా. నాకు నిజంగా చెప్పుకోదగ్గ బాధలేమీ లేవు. మంచివుద్యోగమే. చిన్నకంపెనీ అయినా మంచి పేరుంది. నేను సీనియర్ సైంటిస్టుని. బసంతో యూనివర్సిటీలో రీడరు. నాకు అప్పుడప్పుడూ ప్రయాణాలుంటాయి. బసంతో చూసుకుంటాడు ఇంటినీ పిల్లల్నీ. దేనికీ విసుక్కోడు. నాకే ఎందుకిదంతా అనిపిస్తోంది. బాగా సంపాదిస్తే సుఖపడొచ్చు అంటారు. మరి సుఖపడడానికి టైము కావాలి కదా. అందుకే నేను ఉద్యోగం మానేద్దాం అనుకుంటున్నాను."

"మానేసి ఏం చేస్తావు?"

"ఏమో తెలీదు. ఏవో ఒకటి రెండు ఇండిపెండెంటు ప్రాజెక్టులు వున్నాయి, ఆలోచిస్తున్నాను. కొడైకెనాల్లో ఇల్లు కట్టిస్తున్నాం." రజని కారు పార్క్ చేసి, దిగింది. కాంచన కూడా కారు దిగి చుట్టూ చూడసాగింది. దూరంగా శివపార్వతులు కొలువు తీరి వున్నారు. పాలరాతివిగ్రహం అనంతాల్లోకి

చొచ్చుకుని ఇదే కైలాసమమేమోనన్న భ్రమ కలిగిస్తోంది. కాలిబాటకి ఇరుపైపులా పువ్వులమొక్కలు అందంగా, ఆహ్లాదకరంగా వున్నాయి. బంగాళాఖాతం తన ఉత్తుంగతరంగాలతో నేపథ్యసంగీతాన్నందిస్తోంది ఉచితంగా.

కాంచన సముద్రంవేపు చూస్తూ నిలబడిపోయింది. బంగాళాఖాతంలో కనిపించని సుడిగుండాలు వుంటాయంటారు.  … అప్పట్లో ఈ శిల్పం లేదు. ఈ ఉద్యానవనాలు లేవు. దిగంతాల ప్రతిధ్వనిస్తూ సాగరసంగీతం మాత్రం అప్పటికీ ఇప్పటికీ ఒక్కలాగే వుంది.

“అసలు ఎవరైనా పెళ్లెందుకు చేసుకుంటారండీ?”

కాంచన తృళ్లిపడి రజనిమొహంలోకి పరీక్షగా చూసింది. ఇంతవరకూ చెప్పినవిషయాల్లో తనసంసారంలో ఒడుదుడుకులేం వున్నట్టు కనిపించలేదు. అనుకూలుడయిన భర్తా, బుద్ధిమంతులయిన పిల్లలూ, చెప్పుకోదగ్గ ఆర్థికస్థాయీ – సాధారణంగా ఒక మనిషి కోరుకునే అన్ని వైభవాలూ అమరినట్టే వున్నాయి. మరి ఆ ప్రశ్నేమిటి?

రజని కూడా ఆమాటే అంది. “నేనిలా అడిగేనని మరోలా అనుకోకండి. అనుభవం వున్నవారూ, విస్తృతంగా లోకం చూసినవారూ కనక అడుగుతున్నాను. ఈనాటి సామాజికవ్యవస్థలో పెళ్లికి గల ‘విలువ’ అనాలో ‘స్థానం’ అనాలో తెలీదు – ఏదో అది ఏమిటి అని?”

“నాఅనుభవాలు పెళ్లి సౌభాగ్యం వివరించడానికి పనికిరావులే” అంది కాంచన తేలిగ్గా నవ్వేసి.

రజని రెండు క్షణాలు వూరుకుని, “ఇప్పుడు నాకు పెళ్లిగురించి తెలిసినసంగతులు పదిహేనేళ్లక్రితం తెలిసివుంటే, నేను పెళ్లి చేసుకునేదాన్ని కాను,” అంది.

కాంచన నిశ్చలంగా కళ్లప్పగించి చూస్తోంది. సముద్రంలో అలలు విరుచుకుపడుతున్నాయి సమరోత్సాహంతో ఉరకలేస్తున్న యుద్ధాశ్వాల్లా. కాంచనమనసులో మరొక ప్రశ్న అడగాలన్న కోరిక క్షణకాలం రేగి వెనుదిరింది ఆ అలల్లాగే. రజని ఒకవేళ ఇంతకాలం పెళ్లి చేసుకోకుండా వుండివుంటే, ఇప్పుడు పెళ్లినిగూర్చి తెలిసిన విషయాలు అప్పుడు తెలిసివుంటే, పెళ్లి కావాలనే అనుకునేదా? కాంచన పెదిమలు ఆచి పట్టుకుంది. ఆ ప్రశ్న ఒట్టి తర్కానికి పనికొస్తుందే గానీ ఇప్పుడు అడగదగినది కాదు. … ప్రస్తుతం రజని ప్రస్తావిస్తున్నది పదిహేనేళ్ల సాంసారికజీవనం తరచి చూసుకున్నతరవాత తనకి కలిగిన అవగాహన. అది తనతో పంచుకుంటోంది. ఆఅమ్మాయికి కావలసింది జవాబు కాదు. వినేవాళ్లు! అంతే.

మరో గంటసేపు తిరిగి ఇంటికి మళ్లేరు. కాంచనఇంటిముందు కారు ఆపి, దిగింది రజని. అటుతిరిగి తను వచ్చేలోపున, కాంచన తలుపు తెరుచుకుని దిగింది.

రజని ఆమెదగ్గరికి వచ్చి, ఎదురుగా నిలబడి, "మీతో మాటాడడం చాలా తేలిక కాంచనగారూ" అంది.

కాంచన తెల్లబోయింది. ఇదే అమెరికాలో అయితే ఆశ్చర్యం లేదు. మోకాలెత్తు లేని పిల్లలు కూడా పేరు పెట్టి పిలుస్తారు కొత్తలో తనకి అది ఎబ్బెట్టుగా తోచేది కూడాను. మన సంస్కృతిలో పెద్దవాళ్లని పేరు పెట్టి పిలవడం మర్యాద కాదు. రజని తనని పేరు పెట్టి పిలవడానికి కారణం వయసుమాట వదిలేసి, కేవలం ఒక స్నేహితురాలిగా తనని గుర్తించడమా? లేదా వాళ్లమ్మకీ తనకీ దృక్పథాలలో గల తేడా గమనించడంవల్లనా? ఇదే తొలిసారి ఆఅమ్మాయి తనని పేరు పెట్టి పిలవడం! ఇంతవరకూ ఏ సంబోధనా లేకుండా జరుపుకుంటూ వచ్చింది దాగుడుమూతలాడుతున్నట్టు. కాంచనకి మాత్రం హాయిగా అనిపించింది ఆపిలుపు.

రజని అదేమీ గమనించనట్టు, చిన్నగా నవ్వి వెనుదిరిగి వెళ్లిపోయింది.

ooo

గాజుతలుపుమీద దబ్ దబ్మంటూ వడగళ్లు చప్పుళ్లు చేయడంతో కాంచన త్రుళ్లిపడి బయటికి చూసింది. ఆకాశంలో నల్లటి చిక్కటి మబ్బులు దట్టంగా కమ్ముకుని రాత్రి అయిపోయిందేమో అనిపిస్తోంది. మధ్య మధ్యలో మెరుపులు తళుక్కున మెరిసి క్షణకాలం గదినిండా వెలుగు నింపి వెళ్లిపోతున్నాయి. కాంచన అలా చూస్తూ కూర్చుండిపోయింది రజనిని తలుచుకుంటూ చాలాసేపు.

ఆపిల్లకీ, తనకీ సమస్య ఒకటేనా? పరస్పరం వ్యతిరేకమయిన అనుభవాలనీ, పరిస్థితులనీ ఎలా సమన్వయపరుచుకోవడం? పెళ్లీ, పిల్లలూ, స్నేహాలూ. వయసులో తారతమ్యాలూ, అవి తెచ్చే ప్రత్యేకపరిస్థితులూ … ఏది కావాలి? కావలసింది సాధించుకున్న తరవాత ఏమిటి చేయాలి? దినదినం మనం చేసేవన్నీ రోజు గడవడానికా, మరేదో సాధించడానికా?

కాంచన తనవయసెప్పుడూ దాచుకోలేదు. ఇప్పుడు పెద్దదాన్నన్న బాధ కంటే ఆతలపువల్ల వచ్చే ఈతిబాధ ఎక్కువగా వుంది. దానికి కారణం మాత్రం ఇదమిత్థంగా చెప్పలేకపోతోంది.

పెద్దపెట్టున మరో మేఘం గర్జించింది. కాంచన నెమ్మదిగా ముందుకి ఒంగి లాప్టాప్ అందుకుని తెరిచింది. నీలితెరమీద పెద్దతనంనీడలు మరింత స్పష్టంగా కనిపిస్తున్నాయి.

బుద్ధి పని చేయడంలేదు. సినిమాకి వెళ్తేనో అనిపించింది. ఆమధ్య ఎవరో అన్నారు జూలీ-జూలియా బాగుందని. జూలియా ఛైల్డ్సురించి చాలా వింది. వాన .. ఎలాగా వాకింగుకి వెళ్లడం పడదు. వానకోటు అందుకుని సినమాకి బయల్దేరింది.

కౌంటరుదగ్గర పదిడాలర్లనోటు అందించింది, "సీనియర్ సిటిజన్" అంటూ.

అమ్మాయి క్షణకాలం కాంచనమొహంలోకి చూసి, "యూ డోంట్ లుక్ .." అంది ఆరు డాలర్లు అందిస్తూ.

కాంచన టికెట్టూ, డబ్బూ తీసుకుని థియేటర్వైపు నడిచింది నేలకి జానెడెత్తున గాలిలో తేలిపోతూ – పెద్దదాన్నని చెప్పుకోగలిగినందుకో, మూడు డాలర్లు మిగుల్చుకున్నందుకో, అనువయినచోట అంగీకరించడం తెలికో ...

000

(10.2.2022)

## 22. భుక్తి కుదిరితే గానీ నిష్ఠ కుదరదు (గల్పిక)

ఈ సామెతగురించి ఆలోచిస్తూ నేను చిన్న కథ రాసేను. కథ

ఒక పదేళ్ల బాలుడు ఒక మహాపండితుడైన గురువుదగ్గరకు వచ్చితనకు ధర్మం అంటే ఏమిటో చెప్పమని అడిగేడు. ఆ గురువు ఆ బాలునివంక తేరిపార చూచి, చిత్తశుద్ధితోనే అడుగుతున్నాడని గ్రహించి భీష్ముడు ధర్మరాజాదులకు చేసిన బోధనదగ్గర్నుంచి ధర్మముగురించి మూడుగంటలసేపు వివరించేడు.

పాఠం అయేక తెలిసిందా అని అడిగేరు గురువుగారు.

ఆ అబ్బాయి తలఊచి, రేపు ఎన్నిగంటలకి రమ్మంటారండి అని మళ్లీ అడిగేడు.

ఆయన “రేపు రానవసరం లేదు” అన్నారు.

“కాదండి. నేను మీదగ్గరకొచ్చి పాఠం వినకపోతే, మాఅమ్మ కూడెట్టదండి” అన్నాడు.

గురువుగారికి అర్థమయింది. సరే, పదిగంటలకి రమ్మని చెప్పి పంపేసేడు.

గురుపత్ని, “మీరు చెప్పవలసిందంతా చెప్పేరు. అతడికి ఒక్కముక్క అయినా తెలిసిఉంటే రేపు వస్తాననడు. ఎందుకు రమ్మన్నారు?” అని అడిగింది.

“తల్లిమాట వింటున్నాడు. అంతవరకూ తెలిసింది. మిగతాది ఎప్పుడోఒకప్పుడు తెలుస్తుంది,” అన్నారాయన.

గురుపత్ని వదిలిపెట్టలేదు. “అదేమి వినడం? కూడు పెట్టనంది కనక విన్నాడు.”

గురువు చిరునవ్వుతో ఆమెవంక చూసి, “నీకూ తెలియలేదు అందులో రహస్యం. భుక్తి కుదిరితే గానీ నిష్ఠ కుదరదు. భుక్తి కుదుర్చుకోడానికి మార్గం తెలుసుకున్నాడు. భుక్తి కుదుర్చుకునే దృష్టి వచ్చింది. నిష్ఠ నెమ్మదిమీద వస్తుంది” అన్నారాయన.

000

((నాకథ ఇంతే. ఈ చిన్నికథమీద బ్రహ్మశ్రీ ఆచార్య రాణి సదాశివమూర్తిగారు చేసిన వ్యాఖ్యానం నాకు జ్ఞానదాయకమైంది. వారి అనుమతితో శ్రీ సదాశివమూర్తిగారి వ్యాఖ్యానం ఇదుగో.

ధర్మో రక్షతి రక్షితః అంటే ఇదే.

చిన్న కథలో చక్కని ఆలోచనను కలిగించే సందేశాన్ని ముత్యపుచిప్పలో ముత్యంలాగా దాచి

అందించారు. గురుపత్ని గమనించిన విషయాన్ని గురువు కూడా గమనించేఉన్నారని వారి మాటల్లో తెలుస్తూనే ఉంది.

అయినా శిష్యుడు జిజ్ఞాసుపై వచ్చాడు కనుక అడిగిన వాళ్ళకి అర్హత చూసి చెప్పాలి అన్న గురుధర్మాన్ని ఆయన పాటించారు.

ఇదే ధర్మాన్ని రక్షించడం అంటే.

చక్కని కథ.. అతి క్లుప్త కథనం

అక్టోబరు 16, 2022))

000

(10.16.2022)

# 23. ఆఖరి శుద్ధప్రతి (కథ)

(ఇటీవల రచయితలకూ సంపాదకులకూ (ముఖ్యంగా జాలపత్రికలకి ఈసౌకర్యం ఎక్కువ అయింది. ఒకొకప్పుడు జరుగుతున్న ఉత్తరప్రత్యుత్తరాలు చూస్తే నవ్వొస్తుంది. ఇక్కడ ఆ ఉత్తరాలు ప్రచురించలేదు. కేవలం రచయిత ఆఖరిఉత్తరం ఇలా ఉంటుంది అని చెప్పడమే ఈ రచన ఉద్దేశం.)

గౌరవనీయులైన "రేపటికథ మాసపత్రిక" సంపాదకులుగారికి,

నమస్కారములు. నాలుగునెలలక్రితం మీ "రేపటికథలు మాసపత్రిక"లో ప్రచురణార్థం పంపినకథ మెరుగుపరిచడానికి మీరు ఇచ్చిన సూచనలు ఈరోజు ఆసాంతం మరొకసారి తరిచి చూచుకొన్నాను. మొదట మీకు కృతజ్ఞతలు చెప్పుకోవడం న్యాయం. మీరు శ్రమ తీసుకుని ఎంతో వివరంగా కథలోని ప్రతి అంగం విడివిడిగా చర్చిస్తూ ఇచ్చిన సూచనలు ఇలా మొదటినుంచి చివరివరకూ చూస్తున్నారంటే నాకు మరోమాట తోచడం లేదు నమోనమః తప్ప. ఈవిషయంలో మీశ్రమ అనన్యసామాన్యం, అద్వితీయం, అమోఘం.

పోతే, మనమధ్య నడచిన ఉత్తరప్రత్యుత్తరాలు సూక్ష్మంగా మనవి చేసుకుని శలవు తీసుకోడం నాధర్మం అనుకుంటున్నాను.

మొదట శీర్షిక విషయం. శీర్షిక సూదంటురాయిలా పాఠకుడిని ఆకర్షించాలనీ, ఆకొన్న కొదమసింగముఎదుట మేకపిల్లని ఉంచినట్టు ఉండాలనీ మీరు చేసిన సూచన అద్భుతం. నేను యథాశక్తి ప్రయత్నం చేసి మీచేత అవుననిపించుకోగలగడం నా పూర్వజన్మసుకృతము.

ఎత్తుగడ – నేను బీచిలో కలుసుకున్నట్టు రాసేను. మీరు కాలేజీలో అయితే తరుచూ కలుసుకోడం, మాట్లాడుకోడం జరుగుతుంది. అది అత్యంత సహజంగా ఉంటుందన్నారు. తదనుగుణంగా మార్చేను. దానివల్ల కథలో కూడా మార్పులు చేయవలసివచ్చింది. అదెంతపని లెండి, మీరు తీసుకున్న శ్రద్ధముందు.

ఎత్తుగడ తరవాత పాఠకులని ఆకట్టుకునేది భాష. మీరూ గమనించే ఉంటారు. శిష్టజనవ్యావహారికం అంటూ ఒక సార్వజనీనమైన, అంటే సర్వజనులనూ ఆకట్టుకోగల భాష ఒకటి ఉంది. దానిని ప్రామాణికం చేసేయి పత్రికలు 1940, 50 దశకాలలో. అయితే భాష అచలం కాదు. కాలగతిలో మారుతూ వస్తుంది. ఇప్పుడు మనకి కావలసింది ఆనాటి శిష్టజనవ్యావహారికం కాదు.

ప్రస్తుతం చదువరులు ఆశించేది ఇష్టజనవ్యావహారికం. వారికి ఏది ఇష్టమో ఆ పదమే కనిపించాలి. సంతోషం అనరు. హ్యాపీ అంటారు. కొబ్బరిపచ్చడి కాదు కోకొనట్ చట్నీ.
చట్నీ ఇంగ్లీషు కాదు నిజమే. కానీ ఇప్పుడు అందరికీ తెలిసినపదం చట్నీయే కాని పచ్చడి కాదు. అద్భుతం సంస్కృతం, వండర్ఫుల్లు అనడమే ఉచితం.

ఆభాషకోసం గంటలతరబడి ఫేస్బుక్కులో టపాలు చదివీ, యూట్యూబులో విడియోలు చూసీ నాకు ఉపయోగపడగల పదాలు సేకరించుకున్నాను. వారం రోజులు పట్టింది. కొన్ని అర్థం చేసుకోడానికి కూడా. చాలా సమయం వెచ్చించవలసివచ్చింది. ఇందువల్ల నా భాషాపరిజ్ఞానం అభివృద్ధి అయింది మీదయవల్లనేనని ఒప్పుకోకతప్పదు.

మీరు ప్రస్తావించిన మరొక విషయం ఇక్కడ తప్పనిసరిగా మరొకసారి మననం చేసుకోవాలి. అసలు తెలుగుకథ ఎలా రాయాలో తెలియాలంటే ఇంగ్లీషుకథలు చదవాలన్న మీ అభిప్రాయం ఫ్రేము కట్టి నాపడగ్గదిలో పెట్టుకున్నాను. ప్రతిరోజు పడుకునేముందూ, లేచినవెంటనే తలుచుకోవడంకోసం. కాఫ్కా కథల్లో అసంబద్ధ వాస్తవికత,
కాథరీన్ మాన్స్ఫీల్డ్ కథల్లో వస్తునిష్ఠ వాస్తవికత, చెహోవ్ కథల్లో హాస్యంతో కూడిన ఆర్ద్రత, ఓహెన్రీ కథల్లో సంభ్రమాశ్చర్యాలతో కూడిన ముచ్చటైన ముగింపు – ఇవన్నీ తెలుసుకోకుండా కథలు రాయడం తెలివితక్కువ అన్న మీమాట ఎంతైనా కొనియాడదగ్గది. ఆయా కథలలో విశేషాలు సూక్ష్మంగా గ్రహించడానికే మూడువారాలు పట్టింది. అయితేనేం, నాకు వారి కిటుకులు తెలిసిపోయేయి కదా. నాకు చేతనయినంతలో వారినైపుణ్యాలను అనుకరిస్తూ కథ తిరగరాసేను.

మీరు చివరిమాటగా చెప్పినవిషయాలు కుదిస్తే నాకు అర్థమయింది ఏమిటంటే పాఠకులకి వినోదం అందించాలి. పాఠకులని ఆలోచించుకునేలా చేయాలి.
కథ అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు ఉండాలి. కథలో సామాజికస్పృహ ఉంటాలి. ప్రగతిశీలకంగా ఉండాలి. విషాదాంతం కావాలి. సందేశాలుండాలి, ఉపదేశాలుండకూడదు.

మొత్తంమీద తెలుగుకథ ఎలా రాయాలో తెలిసిపోయింది.
ఈఉదయం పోస్టు చేసేముందు నా తొలిప్రతితో పోల్చి చూసుకున్నాను. పోలికే లేదు. ఇది పూర్తిగా మరొకకథ. ఈకథ మీకథ. మీసూచనలన్నీ తు చ తప్పకుండా పాటించి వ్రాసినకథ. అందుచేత ఇది మీరు మీపేరుమీదే ప్రచురించుకొనడం సమంజసమూ,
ఉత్తమమూ అని నేను గట్టిగా నమ్ముతున్నాను.

ఎందుకంటే, ఈకథ ప్రచురించేక, పాఠకులు అభిప్రాయాలు చెప్తారు. కొన్ని విషయాల్లో ఇలా కాదు అలా రాయాల్సింది
అంటారు. “కాలేజీలో కాదు బీచిలో కలుసుకున్నట్టు వ్రాస్తే బాగుంటుంది” అనొచ్చు ఒకరు.

అంత ఇంగ్లీషేమిటి అనొచ్చు

మరొకరు.  అప్పుడు నేను వారందరికీ,  “సంపాదకులు అలా వ్రాయమన్నారు” అని చెప్పవలసివస్తుంది. చూసేరు కదూ, అందుచేత చెప్తున్నాను, మీరు ఈకథను మీకథగానే ప్రచురించుకొనుట సమంజసము.

ఇట్లు

ఓకే రావు.

తా.క.

నాకథ “ఎల్లుండికథలు వారపత్రిక” సంపాదకులు అంగీకరించేరు. రచయితలు ఎలా పంపినది అ లాగే వేసుకోడమే వారి పాలసీట. మరీ ఘోరమైన తప్పిదాలు – ఒకేపేరు రెండు పాత్రలకి పెట్టడంలాటివి తప్పిస్తే, కథ వారికి నచ్చకపోతే తిరస్కరిస్తారుట. అక్కడితో సరి. వారాలూ నెలలూ సాగదీయడాలుండవు.

చిత్తగించవలెను.

16 ఏప్రిల్ 2022.

000

((ఈరచన  “ప్రియమైన నీకు” సంకలనంలో ప్రచురితం. 2022.

సంపాదకురాలు జ్యోతి వలబోజుగారిసౌజన్యంతో.))

000

(4.16.2023)

# 24. నీకిష్టం అనుకుని (కథ)

అనగా అనగా ఒక మహారచయిత్రి. పేరు బాలాకుమారి అనుకుందాం. నాసౌకర్యంకోసం బా.కు. అంటాను.

బా.కు. ఒక కథ రాసింది. కథపేరు మామిడిపిందెలంచు పట్టుచీరె. పట్టుచీరెకథకి పెద్దపేరు వచ్చింది.

ఆతరవాత బా.కు. ఆతరవాత ఆరునెలలయేక, దేశం వెళ్లింది రెండువారాలు బంధుమిత్రులతో గడపడానికి బా.కు. మొదట ఆనవాయితీప్రకారం అమ్మగారింటికే వెళ్లింది. అన్నదమ్ములు ఆప్యాయంగా ఆదరించి పట్టుచీరె పెట్టేరు. నీకిష్టం కదా అని అంది వదినగారు. మామిడిపిందెలంచు కంచిపట్టుచీరె.

బా.కు. సంతోషం వెలిబుచ్చి, కథలో రాసేనవన్నీ నాఇష్టాలే అనుకుంటావా అంటూ నవ్వింది. ఏమో మరి మీఅన్నగారు అన్నారు అంది వదినగారు.

రెండురోజులయేక స్నేహితురాలింటికి వెళ్లింది. ఆస్నేహితురాలు ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించి, పంచభక్ష్యపరమాన్నాలతో విందు చేసి, పసుపుకుంకుమలతో, పళ్లు, పూలతో పట్టుచీరె పెట్టింది. బా.కు. నీకెంత జ్ఞాపకమే అంటూ చిన్నగా నవ్వింది.

“మరి నీకథలు అంత తేలిగ్గా మరిచిపోగలమా?” అంది స్నేహితురాలు.

మరుసటివారం పొరుగూరులో ఉన్న అత్తగారినీ ఆడబడుచులనీ చూడడానికి వెళ్లింది. సరే, మీకు తెలిసిపోయిఉంటుంది. అత్తగారు ఆప్యాయంగా పట్టుచీరె పెట్టేరు. బా.కు. బ్రహ్మానందం వెలిబుచ్చి చీరె అందుకుని, అత్తగారికి పాదాభివందనంచేసి బండెక్కింది, తిరపతికి రైలెక్కింది. “శ్రీధరునిఇంటికి వెళ్లు. నీకథలంటే ఆ దంపతులిద్దరూ చెవి కోసుకుంటారు. నీకు అన్ని సదుపాయాలూ చూస్తాడు.” అని మరీ మరీ చెప్పేడు పతిదేవుడు బాలాపతి. అంచేత ఆ మొక్కు కూడా తీర్చుకోడానికి బయల్దేరింది.

ఎందుకైనా మంచిదని మామి. పట్టుచీరె కట్టుకుని రైలు దిగింది.

తిరుపతిలో శ్రీధర దంపతులిద్దరూ, ప్రేమపూర్వకంగా సమాదరించి, లోపలికి తీసుకెళ్లి, ఏడుకొండలవాడిదర్శనం చేయించి, రెండోరోజు బండి ఎక్కించేరు. ఎక్కించేముందు “మీకు మామిడిపిందెలంచు పట్టుచీరె ఇష్టం అని చెన్నైనించి తెప్పించేరు మావారు. మీదగ్గర ఉందన్నమాట,” అంది చిరునవ్వుతో బా.కు. భర్తగారి మిత్రుడిగారి భార్యామణి.

“కథ చదివేనా?”

“కథ చదివేం. చాలా బాగుంది. నిజంగా మీమనసులో మాటే చెప్పేరనిపించింది.”

“భలేవారే. రేపు అమెరికా అధ్యక్షుడిని అని మరోకథ రాస్తే నేను అధ్యక్షుడినే అనుకుంటారా?”

“కాదా? నయమే, ముందే చెప్పేరు. నేనూ మావారూ వారంరోజులు వాదించుకునేవాళ్లం అవునని ఆయనా, కాదని నేనూను.”

నవ్వులు.

“ఎంతో ఆప్యాయంగా ఆదరించేరు. శ్రమ అనుకోకుండా తీసుకెళ్లి స్పెషల్ దర్శనం చేయించేరు. అంతకంటే ఏం కావాలి” అంది బా.కు. సున్నితంగా.

“అలా అనకండి. రెండు ఉంటే ఏమయింది. మార్చి మార్చి కట్టుకుంటే ఎక్కువ కాలం మన్నుతాయి కూడా.”

“అలా కూడా అనుకోవచ్చునండి. అయినా చీరె పెట్టితీరాలని ఏముందండి. మీఆదరణే పది చీరెలపెట్టు.”

“ఆయన పనిగట్టుకుని చెన్నపట్నంనించి తెప్పించేరు. వద్దనకండి. ఇంటి ఆడబడుచులాగే మీరూను. మళ్లీ మళ్లీ వచ్చే దూరాలు కావు కదా.”

ఆఖరికి, బాలాకుమారి రెండువారాల పర్యటన ముగించుకుని అమెరికా చేరుకుంది, సూట్ కేసులో సగం మామిడిపిందెలఅంచు కంచిపట్టు చీరెలతో.

ఆలోచించి, అమెరికాలో మిత్రురాళ్లకి ఆ చీరెలు పంచిపెట్టింది.

జులైలో అమెరికాలో ఒకమహా నగరంలో తెలుగు మహాసభ జరిగింది. బా.కు.ని ఏదో పేనలులో మాట్లాడమని ఆహ్వానించేరు.

సభ ప్రారంభమయింది. బా.కు. సభావేదికపై మైకు ముందు నిలబడి, సభికులని చూసింది. ముందు వరసలో నలుగురు మిత్రురాళ్లు కనిపించేరు మందహాసంతో మామిడిపిందెఅంచు కంచిపట్టుచీరెలలో, నీకిష్టమని అని కనుసైగలు చేస్తూ.

అన్నట్టు చెప్పడం మరిచేను. ఆనాటిసభలో బాలాకుమారి ప్రసంగించిన అంశం – “కథకుడు పేరు, రచయిత పేరు”

ఇందలి నీతి. కథలన్నీ కథకుడి ఆత్మకథలు కావు. కథలని అనుసరించి రచయితని అంచనా వేయరాదు.

(2.9.2023)

# 25. వాక్స్వాతంత్ర్యము వెల (కథ)

సత్యసంధీష్ అమెరికా వచ్చేముందు ఆంధ్రదేశంలో చాలామంది అతనికి చెప్పేరు అమెరికా స్వేచ్ఛకి పెట్టింది పేరు. ఇక్కడిలా బాసులకి భయపడక్ఖర్లేదు. నీభావాలు స్వేచ్ఛగా ప్రకటించవచ్చు.

వాక్ స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం, … అంటూ అమెరికాలో స్వేచ్ఛాగానం వేనోళ్ల పాడేరు.

సత్యసంధీష్ అమందానందభరితుడై విమానం ఎక్కేడు. మనదేశంలో మనం చెప్పుకునే కట్టుబాట్లు లేవక్కడ, ఆహ్ దేశమంటే అదీ అనుకుంటూ.

ఉద్యోగంలో చేరగానే, మేనేజరు ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించి, మృదుమధురస్వరముతో అతని విధ్యుక్తధర్మాలు వివరించేడు. సత్యసంధీష్ ఆయన అంత చక్కగా తనతో భాషిస్తున్నందుకు సంతోషించేడు. ఆఫీసంటే ఇలా ఉండాలి, మేనేజరంటే ఇలా ఉండాలి అనుకుని మురిసిపోయేడు.

వారంరోజులయింది. ఆఫీసు నియమాలు కొన్ని సత్యసంధీషుకి నచ్చలేదు. అవి న్యాయం కాదు అనుకున్నాడు.

వాక్ స్వేచ్ఛ గుర్తొచ్చింది. మేనేజరుగదికి వెళ్ళి, సర్ అన్నాడు.

మేనేజరు సర్ అనక్కర్లేదు, నాపేరు టామ్. అలాగే పిలు అన్నాడు.

స.సం. మరీ గొప్ప పడిపోయేడు. మేనేజరుని ఉన్నతాధికారిలా సర్, మిస్టర్ లాటి గౌరవవాచకాలు వాడక్కర్లేదు. అద్భుతం.

“ఓకే, టామ్, మీనియమాలగురించి మాట్లాడాలి,” అన్నాడు.

“సరే. చెప్పు,” అన్నాడు టామ్.

ఇలా ఉండకూడదు, అలా మార్చాలి అంటూ తనభావాలు ప్రకటించేడు.

మేనేజరు చిరునవ్వుతో, “అవునా, హుమ్. నాకెందుకు తోచలేదు చెప్మా. మీఅభిప్రాయాలు వెలిబుచ్చినందుకు సంతోషం. తప్పక ఆలోచిస్తాను,” అన్నాడు.

వేరు చెప్పనేల, స.సం. వాక్స్వాతంత్ర్యం అంటే ఏమిటో జీవితంలో తొలిసారి రుచి చూసేడు. ఆఫీసంటే ఇదీ అంటూ పాతికసార్లైనా మెచ్చుకుని ఉంటాడు.

మర్నాడు ఆఫీసుకి వెళ్లేడు. మేనేజరు పిలిచేడు.

“మీసూచనలు మాబోర్డువారము పరిశీలించేము. మీరు ఇంత శ్రద్ధ తీసుకుని, ఇంత శ్రమపడి మాపాలసీలను పరిశీలించి మీఅభిప్రాయాలు చెప్పినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాము. మీకు సమ్మతము కానీ పాలసీలతో మిమ్మల్ని ఇబ్బంది పెట్టుట మాకు అభిమతము కాదు. అది మాపాలసీలకు విరుద్ధము. మీరు రేపటినుండి ఆఫీసుకి రానవసరంలేదు. మీకు తగిన ఉద్యోగము త్వరలోనే లభించగలదని ఆశిస్తున్నాము. మీకు చక్కని referral ఇస్తాము. – ఇట్లు, ఆఫీసు మేనేజరు.”

హా! స.సం. మూర్ఛ పోబోయి నిలదొక్కుకుని” అది కాదు సర్” అనబోయి, “టాం” అని సరిదిద్దుకుని ఏదో చెప్పబోయేడు.

మేనేజరు ఫోను తీసి పట్టుకుని, “క్షమించండి,” అని నిష్క్రమణద్వారం చూపించేడు.

అహో! ఎంత సుందరంగా మంగళం పాడేసేడు అని సత్యసంధేష్ ఆశ్చర్యపోయేడు. ఆ తరవాత మరో రెండు రోజులయేక తెలిసింది వాక్స్వాతంత్ర్యం వెనుక ఉన్న తకరారు.

అభిప్రాయాలు వెలిబుచ్చవచ్చు. అలా వెలిబుచ్చేముందు, ఆపైన రాగల పరిణామాలగురించి ఆలోచించాలి మరి.

ooo

ఫిబ్రవరి 21, 2023

(చాలా పాతకథలు ఇటీవలికాలంలో దొరికినవి)

## 26. రాద్ధాంతం (గల్పిక)

(ఇంతవరకూ దొరికినవాటిలో ఇదే మొదటికథ, నిజానికి గల్పిక. ఆగస్టు 6, 1954లో తెలుగు స్వతంత్రలో ప్రచురించబడింది.

నేను 5వఫారం చదువుతున్నరోజులలో స్కూలు మేగజీనుకోసం చాదస్తం అని ఒకకథ రాసేనని ఆనాటి స్నేహితురాలు చెప్పింది. ఈరెండుకథల శీర్షికలూ నారచనావిధానానికి అద్దం పడుతున్నట్టుంది. -:))

గల్పిక

### రాద్ధాంతం!

నిడదవోలు మాలతి

"అమ్మగారు సెయ్యమ్మన్నారండీ" అంటూ ఓ చిన్నగిన్నె చేత్తోపుచ్చుకొని వచ్చాడు ఒక కుర్రాడు.

"ఎవరూ?" అన్నాన్నేను ఎవరో అర్థంగాక.

"చుక్కమ్మగారు."

"ఎవరూ?"

"ఆ యింట్లో ఉన్నవారూ..." అంటో, మాయింటి పక్కింటికి ఎదురింటికి ఎడంపక్కిల్లు చూపించాడు సాధారణంగా.

"మిస్ రైనాసిరస్" అనడమేకాని పేరు ఇన్నాళ్ళు తెలీదుకాని ఆ యింట్లో ఉన్నారని తెలుసు.

"వెనకనుంచి ఏకంగా స్వయంపాకం పంపిస్తాంలే, వెళ్ళు" అన్నాను విసుగ్గా. వాడు వెళ్ళిపోయాడు.

అమ్మవచ్చింది, "ఎవరే?" అంటూ.

## 27. రాద్ధాంతంపై సిద్ధాంతం (గల్పిక)

(సెప్టెంబరు 3, 1954లో తెలుగు స్వతంత్రలో ప్రచురించబడింది.)



వ్రాలేవని, ఆ ఉచ్ఛ్వాస నిశ్వాసలు జనావళి బాధల విముక్తికి బలిగా ఆగిపోవడానికి సిద్ధపడేవని, అయ్యయ్యో! దానికి తెలియదు.

దానికేమీ తెలియదు! బ్రహ్మరాక్షసుడిలా అతని తలను బద్దలు చేస్తూ తీరని రక్తదాహంతో నదిలో వడివడిగా ముందుకు సాగిపోవడం ఒక్కటే దానికి తెలిసింది... అంతే...

'అమ్మా!' అంటూ జగన్నాథం ప్రాణవాయువులు ఆ గోదావరీ తల్లి ఎదలో లీనమై పోయాయి.

ఏ తల్లి అతన్ని ఇన్నాళ్ళు పెంచి పెద్ద చేసిందో... ఆ తల్లి "అయ్యో! జగన్నాథం నీమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నానోయ్" అంటూ భోరున విలపించింది.

ఈ దృశ్యం చూడలేని బాలచంద్రుడు ఆకసాన అస్తమించిపోయాడు.

ఈ భయానక దృశ్యాన్ని చూసిన మాస్టరు గారి భార్య, "జగన్నాథం... జగన్నాథం... అయ్యో దేవుడివైన నీకే చావు మూడిందా నాయనా అయ్యో..." అంటూ తెలివి తప్పి పడిపోయింది.

అప్పుడే ఈ మహాప్రళయంలోనికి జగన్నాథం ఊహాలకు ప్రాణంగా "కేర్"మని ఒక శిశువు అవతరించింది.

(సమాప్తం)

గల్పిక

# రాద్ధాంతంపై సిద్ధాంతం

నిడదవోలు మాలతి

"ఏం వోయ్ ఈ మధ్య రచయిత్రివై పోయావేం?"

"నేనా?"

"ఊం. మంచి రాద్ధాంతం రాశావులే!"

"రాద్ధాంతం? అవును. రాశాను అయితే?"

"అయితే? ఆ కథలో రాముడి బంధువులు మాయింటిదగ్గిరున్నారు."

"అవును తెలుసు."

"వాళ్ళు చదివారు. కోపం వచ్చింది."

"వాళ్ళకా? నీకా?"

"వాళ్ళకే నీకు గర్వంట. అందుకే అలా వాళ్ళమీద రాసేవుట."

"నేను వాళ్ళమీద రాయలేదే!"

"అదే లే. వాళ్ళవాళ్ళమీద."

"వాళ్ళవాళ్ళమీద రాయలేదు. పుచ్చకాయలు దొంగలు."

* * *

"మొన్న నీకథ చదివేనోయ్."

"సంతోషమండీ."

"అదేంవిటోయ్. పేర్లేనా మార్చకుండా అలా రాసేశావ్?"

"పేర్లు మారిస్తేమటుకు మీవాళ్ళు గ్రహించలేరా?"

"ఏమైనా పేర్లు మారిస్తేనే బాగుండేది... నేను నిన్నేం అనడంలేదు. కథలు రాయడం మంచిదే. లేకపోతే ఇలాటి అన్యాయాలు అందరికీ ఎలా తెలుస్తాయ్? నేనన్నది మార్పుమాట."

"అవున్లెండి. ఎప్పటికయ్యది ప్రస్తుతమో అప్పటికామాట ఆడమన్నాడు కదా కవి."

"అబ్బే. నిన్ను నేనేం అనడంలేదోయ్."

* * *

ఇంట్లో వాళ్లూ నన్నే అంటూన్నారు పైవాళ్లూ నన్నే అంటున్నారు. అంతా నాదే తప్పంటారు. అదేదో కథ జ్ఞాపకం వస్తోంది. నిద్రపోతున్న రచయిత్రికి కథానాయకుడు సాక్షాత్కరించి రచయిత్రిని నిందించాడట, తనకే అన్ని కష్టాలు పెట్టినందుకు. పైగా తనకి ముగ్గురాడపిల్లలైతే ఆరుగురని రాసి రచయిత్రి అసత్యప్రచారం చేసిందని. అలాగుంది. అసలు వాళ్ళు ఏమీ అనలేదు. మధ్య వాళ్ళకెందుకు బాధ? అసలు హెడ్డింగుపైన ఎడంచేతి వేపుమూల మూడక్షరాలలో ప్రకటించబడిన "గల్పిక" కనిపించలేదు. ముక్కోటి ఆంధ్రులలో ఏ ఒక్కడికీ పోలికలేకుండా రాయడం కష్టమే. అందుకే ఒక సిద్ధాంతం చేసుకున్నా, "ఇహామీద ఏదీ సూటిగా తేల్చక, ముంచక, మధ్యస్థంగా రాయాలి." అని! ★

## 28. మామ్మగారి మరణం (గల్పిక)

(జులై 22, 1955లో తెలుగు స్వతంత్రలో ప్రచురితం)






# మామ్మగారి మరణం

నిడదవోలు మాలతి

ఆధ్యాత్మ రామాయణ కీర్తన పాడుకుంటున్న జానకమ్మ చేతిమీదకి ఆవిర్లు రావడంతో సంగీతం ఆపింది. సదవకాశం కోసం ఎదురుచూస్తూ గుమ్మంలో నిలబడ్డ చిన్నగాడు వేపపుల్లతో ఇత్తడి పళ్ళెం ఠంగ్ మనిపించి, "జంతువులలో అందమైనవి గుఱ్ఱాలు. అలాగుసెనె..." అంటున్నాడు. హఠాత్ గా అయిన శబ్దానికి త్రుళ్ళిపడి జానకమ్మ గంజి వారుస్తున్న అన్నపుగిన్నె అరుగు అంచున అలాగే వదిలేసి వెనుతిరిగింది. విసురుగా, చిన్నగాడు బుద్ధిగా వీధిలోకి జారుకున్నాడు. అరుగు అంచున గాలిలో క్షణంపాటు నిస్సహాయంగా ఊగిసలాడి భూమ్యాకర్షణశక్తికి లోబడింది అన్నంగిన్నె.

"వీళ్లేంపిల్లలు బాబూ!"విసుక్కుంది జానికమ్మ.

ఇంతలో మళ్ళీ వచ్చాడు చిన్నగాడు ఒక కవరు పట్టుకుని.

వాడిని చూడగానే చితగొట్టి చెట్నీ చేసేసేదే కాని కవరుచూసి చల్లారిపోయింది.

"పోస్టుమాన్ రమ్మంటున్నాడు" అన్నాడు చిన్నగాడు అతి బుద్ధిమంతుడులాగ.

'ఎందుకూ'అంటూనే చెయ్యికడుక్కుని లేచింది.

వాళ్ళకి ఉత్తరాలంటూ ఏఃవీరావు శుభలేఖలు తప్ప. కాని పోస్టుమాన్ రమ్మంటున్నాడంటే ఇది "టిల్లిగ్రాఫు" అన్నమాట. ఈ "టిల్లిగ్రాఫులు" కొంపలు మునిగిపోతూంటేతప్ప రావని తెలుసు జానకమ్మకి. అందుకే సంతకం చేస్తూంటే చెయ్యి వణికింది. పోస్టుమానవుడు దాటి పోయాకగాని అందులో విషయం ఏమిటో వాడిచేత చదివించవల్సిందని తట్టలేదు. పక్కింటి పదిహేనేళ్ళ కుర్రాణ్ణి 'కాస్త' చదవిపెట్టమంది. అతను అచ్చుపుస్తకంలో అక్షరాలుతప్ప చదవలేడు. అతను మాట్లాడేది టెలిగ్రాఫ్ ఇంగ్లీషే అయినా అతనికి టెలిగ్రామ్స్ అర్థంకావు. ఈ సంగతి చెప్పడానికి అతను నామోషీ కూడా పడడు. అసలు అలా వ్రాసినందుకు ఆ పోస్టుమాస్టర్ సిగ్గుపడాలి కాని మధ్య తనకెందుకు? అయినా అడిగిన ఆవిడ పెద్దమనిషి గదానని చదవడానికి పూనుకున్నాడు, "తరుణమ్మ అంటే తరుణమ్మగారు పాస్డ్-ఎవే-అంటే పాస్ అయిపోయారు అని—ఏదేనా ఎగ్జామినేషన్ కి వెళ్ళారేమిటండీ?" అని.

జానకమ్మకి అయోమయంగా ఉంది, "ఆవిడకి ఇప్పుడేం పరీక్షనాయనా! అరవెయ్యేళ్ళొచ్చాక చదువుకోక మమ్మకొట్టుకుంటూనా అని! సరిగ్గా చూడు బాబూ."

"బాగుందండీ! నాకామాత్రం తెలీదేమిటి? అయినా అడిగారు కనక చెప్పానుగాని జీతం ఇచ్చి పెట్టుకొన్న గుమాస్తాని కాదు!"

జానికమ్మ తప్పనిసరిగా నమ్మింది. కాని ఏమటో మళ్ళీ నమ్మాలనిపించడం లేదు. ఆసలు ఆ పరీక్ష ఏమిటో అడుగుదామంటే వెళ్ళిపోయాడతను. అయినా అంత తలతిరుగుడుగా మాట్లాడే వాడితో మాటేమిటి! విసురుగా జానకమ్మ లోపలి కెళ్ళిపోయింది. పని చేసుకొంటోందేకాని మనసంతా మామ్మగారిమీదే ఉంది. ఆవిడ గోదావరీ పుష్కరాలకి మూడు వారాలు ముందుపుట్టిందిట. పుట్టేక ఐదు పుష్కరాలు అయిపోయాయి. అంటే ఐదు పన్నెండ్లు అరవై. మరొక మూడేళ్ళకి మళ్ళీ పుష్కరం ఉంది. అంటే ఇప్పుడావిడకు అరవైతొమ్మిదన్నమాట. ఇప్పుడు పరీక్షఏమిటి? ఒకటే పరీక్ష పాపాల బోటు (లేకపోతే పుణ్యాల బోటు) వేసుకొని వైతరణి దాటడమే!

చలపతిరావు మేష్టారు రాగానే జోళ్ళుఅయినా విప్పకముందేజానకమ్మ టెలిగ్రాం అందిస్తూ—

"మా తరుణమ్మ మామ్మ ఏదో పరీక్ష పాసయిందటండీ." అంది.

"సరే, నాకు అన్నంపెట్టు." అన్నారు చలపతిరావుగారు నిరామయంగా.

జానకమ్మ అంతసులువుగా కదలలేదు. "ఆ రంగడు సరిగ్గా చెప్పలేదు. ఏం పరీక్షండీ? అయినా

ఇప్పుడు చదువుకొని ఉద్యోగం చేద్దాం అనుకుం దేమిటి?"

"ఏమోమరి. నాకేమీ చెప్పలేదు." అన్నారు మేష్టారు వ్యంగ్యంగా.

"అందులో లేదూ?"

"అందులో ఉన్నదీ ఆవిడ పాసయిపోయిందీ అని. అంటే ఈ లోకంలోంచే దాటేసింది."

"హరిహరీ! ఆ మాటలేమిటండీ?"

"అందులో ఉన్నవే."

"మరి ఆ కుర్రాడు అలా చెప్తే."

మేష్టారికి ఆకలి... చిరాకు. పైగా టైంలేదు. చూడు! నీకు ఎవడిమాట నమ్మాలని ఉంటే వాడిమాట నమ్ము. స్వతంత్ర భారతదేశంలో పుట్టావు గనక ఛాయిస్ నీవంతు. నాకు అన్నం పెట్టేస్తే నీకు ఆలోచించుకోడానికి కావలసినంత టైము. అది ఉభయత్రా శ్రేయస్కరం కూడాను."

జానకమ్మ మేష్టారికి వడ్డించి ఆయన వెళ్ళిపోయిందాకా ఆగలేదు. నిలుచున్న పాటున అర క్షణంలో నిర్ణయానికొచ్చేసింది. మేష్టారిమాటే నమ్మదగ్గదిగా కన్పిస్తోంది.

"మామ్మ మరణించింది." — మరుక్షణంలో కాళ్ళు వణక నారంభించాయి. కొట్టుకుంటున్న గుండెలు ఇంకా వేగంగా కొట్టుకుంటున్నాయి. తిరిగి వచ్చేసరికి చుట్టుపక్కల వారంతా చేరుకొని ఉన్నారు. ఓదారుస్తున్నారు కొందరు. వేదాంతం చెప్తున్నారు కొందరు. "ఏంచేస్తాం." "ఏడ్చి ఏం లాభం" "భూమ్మీద నూకల్లేవు మరి" "పిడుగు లాటి మనిషి. ఎలా పోయిందో," "ముందేనా ఉత్తరం వచ్చిందా?"

రావుగారిని చూడగానే ప్రక్కవాళ్ళంతా ప్రక్కలకి తప్పుకున్నారు. జానకమ్మ వంటింటి వేపునడిచింది. స్కూలికి టైమైపోయి పోతుంది మరి. జానకమ్మ ముఖంచూసి చలపతిరావుగారు అతికష్టంమీద ముత్యాలురాల్చేరు. "ఏమిటో జానకీ! ఎవరి ఖర్మకి ఎవరుకర్తలూ. పుణ్యాత్మురాలు వెళ్ళిపోయింది ఈపాపిష్టిలోకం చూడకుండా!"

జానకమ్మకి తిరిగి దుఃఖంవచ్చింది. "నన్ను కూతురిలా చూసేది. ఆవిడకన్న పెద్దవాళ్లెంత వి లేరుకనక."

"నిజమే మరి." అన్నారు చలపతిరావుగారు.

జానకమ్మ మాట్లాడలేదుగాని కళ్ళనీళ్ళుమటుకు అలా తుడుచుకుంటోంది.

"అంతా మాయ. మనం నీదీ నాదీ అనే మోహంలోపడిపోయి ఎదుటివాడికోసం దుఃఖిస్తాం రేపు మనమూ అంతే ననుకో. ఒకడబ్బుకోసమో ఒక మనిషికోసమో గిలగిల్లాడతాం." అన్నారు మళ్ళీ. ముందర కాళ్ళకి బంధాలు వేయడమంటే ఏమిటో ఆయనకే తెలుసు!

"బాబు పుట్టినప్పుడు ఆవిడ చేసిన సాయం జన్మలో మరుపురాదు. బతికినన్నాళ్ళు ఒకళ్ళ చేత మాటపడలేదు. ఒకళ్ళని మాటనలేదు."

"ఒక్కొక్కళ్ళు ఒక్కొక్కటి మరువలేరు. నాకేమో ఆనాటి బిల్లులు ఇప్పటికీ మరవలేను."

జానకమ్మ రెండు క్షణాలు ఊరుకొని అంది— "ఇవాళ అక్కడికి వెళ్తాను."

చలపతిరావుగారు ప్రసన్నవదనంతో, "టిక్కెట్టుకి డబ్బులున్నాయా?" అన్నారు.

నిజమే! జానకమ్మ మామ్మగారి మరణంముందు టిక్కెట్టు డబ్బులు, మామ్మబహుమానంగాయిచ్చిన బంగారపు ఉంగరమూ చిరుగడ్డిపోచగా నెంచింది. కాని రైల్వేటిక్కెట్ ముక్క అలావదిలెయ్యదు. ఎటొచ్చీ అమ్మకి చిక్కిన మేక——ఉంగరం.

"అలాగని మానుకుంటా మేమిటి?" అంది జానకమ్మ నిష్ఠూరంగా.

"వెళ్ళి ఏంచెయ్యాలి చెప్పు. శవానికి దహన సంస్కారాలు అయిపోయుంటాయి. నువ్వు ఓదార్చడానికైనా పిల్లా మేకా పదిమందిలేరు. ఉన్న ఒక్కకూతురూ వయసుమీరినదే. ఇహ ఆవిడను. బతికించడం మనచేతుల్లో ఉందికనకనా?"

"బాగుంది! లోకమేమనుకుంటుంది? ఇంతకీ నారాత." అంది జానకమ్మ నెత్తికొట్టుకుంటూ. ఆమెకి మేష్టార్ని ఇరవై ఏళ్ళయి తెలుసు.

"అంతేనేరాత. ఏడ్చి ఏంలాభం? ఏదిశాశ్వతం? వస్తా టైమవుతోంది."

జానకమ్మకి వళ్ళుమండింది. "మీ కాసూ్కలూ నాకీవంటిల్లూ శాశ్వతం." అని సణుక్కుంది.

సాయంత్రం బండికి జానకమ్మ బయల్దేరింది చినబాబుని తీసుకొని.

మామ్మగారిదొక పల్లెటూరు. ఆ ఊరుకి సామాన్యులెవరూ సామాన్యపు పనిమీద బయల్దే

రరు. కారణం—జనతా ఎక్స్‌ప్రెస్ దగ్గర్నుంచి కాలినడకదాకా మధ్యలోగల ప్రయాణసౌకర్యాలు అనుభవించనిదే చేరలేని రాజాంతఃపురం ఆ పల్లెటూరు. చినబాబుకి కొంచెం చిరాకువేసింది—ఏరోప్లేన్ కూడా ఎక్కితే సంతృప్తిగా ఉండేది కాని ఆ రూట్ లేదు.

మరణించిన మామ్మగారి ఇల్లు మర్నాడు సాయంత్రం నాలుగున్నరకి చేరిందిజానకమ్మ. తలుపులు బార్లా తీసి ఉన్నాయి. ఇంట్లో ఎవరున్నారు చెప్మా! చంద్రమ్మకి అప్పుడే ఉత్తరం వెళ్ళడం రావడంకూడా అయిపోయిందా! లేక ఊరివాళ్ళే పగలగొట్టేశారేమో? ఆలోచిస్తూ లోపలికి అడుగు పెట్టిన జానకమ్మయొక్క రెండుకళ్ళకీ పెదపొయ్యి మంటపెడుతూన్న మామ్మగారు కనిపించారు. జానకమ్మ నిజంగా రెండు నిముషాలపాటు చచ్చిపోయింది—హాక్ పిన్ కథలో చెప్పినట్టు. ఇంతలో యథాలాపంగా వెనుతిరిగిన తరుణమ్మ జానకినిచూసి చిరునవ్వు నవ్వుతూ "వచ్చావుటే, అలా నిలబడిపోయావేం. అలా ఆ మంచంమీద కూర్చో. మంచినీళ్లు కావాలా?" అంది మామూలుగా ఎక్స్‌పెక్ట్ చేస్తూన్నట్టు.

జానకమ్మ గ్లాసుడు మంచినీళ్లుతాగి తేరుకొంది.

ఆ రాత్రి జానకమ్మ అంది, "నిక్షేపంలా ఉన్నవాళ్ళకి నిక్షేపంలా ఉన్నవాళ్ళని చూస్తే అదేం పోయేకాలమో! ఆ రామయ్యమామ ఏంచేసేడో చూశావా?"

"అదికాదులేవే. నేనే ఆ టెలిగ్రాం వేయించాను. ఏమిటో కాకులు దెబ్బలాడుకుంటున్నప్పుడు చూస్తే అరిష్టం అన్నారందరూను. ఏదో ఇలాగైనా నిన్ను చూడడం అయిందా మరి. ఆ సంగతికేంలేగాని—అన్నట్టు నీ ఉంగరం ఏదే?"

"గ్రహశాంతి - మామ్మా - హోమం చేయించేను-హోమం..." నూతిలోంచి మాట్లాడింది జానకమ్మ.

(సంపూర్ణం)

# నిడదవోలు మాలతి సాహిత్యవ్యాసంగం వివరాలు

తెలుగు తూలిక - బ్లాగు. మాలతి కథలు, వ్యాసాలు, కవితలూ, తదితర రచనలు.

thuika.net website , founded by Nidadavolu Malathi and featuring Telugu stories and informative/analytical articles on various topics in Telugu literature by Nidadavolu Malathi and other writers/translators.

నిడదవోలు మాలతి తెవికీలో ఇక్కడ

Nidadavolu Malathi on wikipedia in English here

నిడదవోలు మాలతి రచనలు ఆర్కైవ్.ఆర్గ్ లో ఇక్కడ